# నవ్వితే నవ్వండి

## మాకభ్యంతరం లేదు



సంకలనం :

ముళ్లపూడి వెంకటరమణ

**నవోదయ పబ్లిషర్స్**

విజయవాడ 2.

# మొదటి జోకం

అట్టహాసం నుండి మందహాసంవరకూ వున్న రకరకాల నవ్వుల్ని—మీ దగ్గర కనీ వినీ ఆనందించాలన్న ఆశతో ఈ పుస్తకం మీముందు నిలబడింది. మాటలూ గీతలూ కలిపి పెరసి 400 సార్లు మీరు నవ్వగా చూడాలని దీని తాత్పర్యం. కొన్నిటికి మీరు నవ్వొచ్చు, కొన్నిటికి నవ్వుకోవచ్చు; మరికొన్నిటికి నవ్విపోవచ్చు. మీరీ బుక్కుని బుకాయించాలని గడుసుగా,అట్టహాసం వచ్చేచోట నిభాయించుకు మందహాసం చేసి వూరుకుంటే ఇది మోసపోదు. ఎందుకంటే, ఇందులో దేశాటనాలుచేసిన జోకు లున్నాయి. స్వగ్రామం స్వదేశం ఏదో మరిచిపోయిన పాప తున్నాయి. ఇంగ్లీషునవ్వులు, అమెరికన్‌నవ్వులు, యూరపియన్ నవ్వులు, ఆసియానవ్వులు చూసిన జోకులున్నాయి. అసలదీకాక, నవ్వుకి సాపేక్ష సిద్ధాంతం (రెలెటివిటీ) వర్తిస్తుందని ఈ పుస్తకం అనుమానం - అంటే దేశకాలపరిస్థితులనుబట్టి ఒక జోకుకు వచ్చే నవ్వు రకరకాలుగా వుంటుందని దీనిఊహ.వెనకటికో పెద్ద మనిషి చెప్పాడు; ఆ యొక్క వానచినుకు పెనంమీద పడితే ఇగిరి చక్కాపోతుంది. సముద్రంలో పడితే నామరూపాల్లేకుండా

పోతుంది. తామరాకుమీద పడితే ముత్యంలా ప్రకాశిస్తుంది. ముత్యపు చిప్పలోపడితే ముత్యమే అయి వూరుకుంటుంది - అని. ఒకవిధంగా జోకులుకూడా అంతే. ఒక జోకు మీరొక్కరూ కూర్చుని చదువుకున్నప్పుడు చిరునవ్వు ఉదయిస్తే; అదే జోకు నలుగురితోకలిసి చదివినప్పుడు గొల్లున నవ్వొస్తుంది. మీరు చిరాగ్గా ఉన్నప్పుడు మీ ఆయన/మీ ఆవిడ చదివితే ఇంకోఫలితాన్నిస్తుంది. ఇద్దరు రోమియోలు ఒక రెండుజెడల సీతముందు ఉండగా ఒకడు ఈ జోకును చెబితే రెండోవాడికి నవ్వురాదు సరిగదా ఏడుపు రావచ్చు. ఏడుపుమార్కు నవ్వురావచ్చు. మీ యింటికొచ్చిన కొత్త చుట్టంవేస్తే మీచేత హుషారుగా నవ్విస్తుంది. నిలవచుట్టం నోట పలికితే అసందర్భ ప్రేలాపనలా వినబడి చిరాకు కలిగిస్తుంది. శ్రీ ఆఫీసు మానేజరుగారుగాని, మీకు అప్పివ్వ బోతున్న ఆసామిగాని, చాలా గొప్పవాడుగాని వేస్తే పొట్ట చెక్కలయేలా నవ్విస్తుంది.

Money is honey, my dear sonny.
And a rich man's joke is always funny.

అన్నాడొక ఆసామి.

కాని, ఇవన్నీ గిట్టనివాళ్ళమాటల్లేండి. మీ రెక్కడ ఎప్పుడు విన్నా నవ్వుతారు. మీరు చాలా మంచివారు. మీ డ్రెస్ ఎంతో బావుంది. మీలా పాపిడి తీసి / తియ్యకుండా తల దువ్వ కోవాలని నాకు చాల సరదాగావుంది. ఆ వాచి ఎక్కడకొన్నారు. మీ పేస్టు యమ పేస్టండీ....చీరలసెలక్షనుమీద మీరు మీ/మా వారపత్రికిలో ఒక వ్యాసం రాయరాదూ....మీకు మంచి సెన్సాఫ్

హ్యూమర్ వుంది. ఈ తెలుగూస్కి సెన్సాఫ్ హ్యూమరు లేద న్నాడో తెలుగూ....మీరు మంచి సరసులు. నవ్వుతారు.

(నవ్వకపోతే ఈ పుస్తకం చిన్నబుచ్చుకుంటుంది. అప్పుడు అక్షరాలు మరీ సలుసులైపోయి మరోసారి చదవాలంటే కష్టం డవు. చత్వారం కాబోసని మీరు కళ్ళజోడు కోసం పరిగెత్తా) అందుకని హాయిగా కడుపారా నవ్వండి. లేకపోతే ఈ పుస్తకం మీరు యింకోళ్ళకి ఎరువిచ్చినంత ఒట్టు.

రమణ.

1

పేపర పంచాయతీ
తెలప్రోలు




(అన్ని అప్పులకూ అమృతాంజనము;

"ఒక్కటే మాట! తెల్లవారేసరికి వంద రూపాయలు అప్పయినా పుట్టించాలి; లేదా ఆలోపల ఉరేసుకు చావాలి. ఏం చెయ్యమంటావ్ చెప్పు."

"ఉరెందుకోయ్. మా యింటో చాకుంది. ఇస్తాను. పట్టికెళ్ళి పని కాగానే పంపించెయ్యి. దాంతోపాటు నాకో పాతిక పాత బాకీ వుండాలి అది కూడా పంపించ్చేద్దు గాని."

* * *

"నాకో రూపాయి అప్పు కావాలనుకోండి. ప్రాణం పోయినాసరే స్నేహితుణ్ణిమాత్రం ఎన్నడూ అడగను. అది నా మతం" అన్నాడు అప్పారావు.

"ఒట్టు?....అయితే యీ క్షణం నించి నన్ను మీ ఆప్త మిత్రులలో ఒకడుగా చేర్చుకోండి" అన్నాడో పరిచితుడు భక్తి గౌరవాలతో.

* * *

"ఏమయ్యా దిగులుగా వున్నావు. ఇందాకా వచ్చిన అప్పువాడి గురించే ఇంకా ఈ బాధ!"

"బలేవాడివే. పుట్టెడప్పులూ పది పుట్ల తిట్లతో వున్నాను. నేనిపుడు తలుచుకుని ఏడుస్తున్నది కిందటి సోం వారం అప్పులాడి తిట్లకి. ఇవాళ్టి వాడికి అప్పుడే ఛాన్సు రాదు. ఈ నెల ఆఖరు సోమవారం వస్తుందనుకుంటాను."

* * *

"ఏవండీ మీ స్నేహితుడిదగ్గర అప్పుచేసి లాటరీ కట్టిస రూపాయివల్ల రెండువేలు ప్రయిజు వచ్చిందిగదా పాపం ఆమాటన్నా అతనికి చెప్పరేం?"

"ఓసి వెర్రిదానా. ఆ మాట చెబితే ఇప్పుడా రూపాయి తే తెమ్మని కూర్చోడూ!"

* * *

రెడ్డి ముఠాకీ, చౌదరి ముఠాకీ కొట్లాట చౌకు దగ్గర. పుచ్చె పువ్వులాటి వెన్నెట్లో పుచ్చెలెగిరి పోతున్నాయి. ఊళ్ళో జనం అంతా తలుపులు బిడాయించుకొని కిటికీలోంచి చూస్తున్నారు.

అప్పులాస్వామి మాత్రం చౌకుమధ్య గాంధీ విగ్రహం కింద కూచుని నిశ్చింతగా చుట్ట గాలుస్తున్నాడు.

మర్నాడు ఉదయం "ఏవి ధైర్యం? తల లెగిరిపోతుంటే చేతి కర్రన్నా లేకుండా అంత ధైర్యంగా కూర్చున్నావే" అన్నాడు మునసబు.

అప్పుల్స్వామి నవ్వాడు. "బాబూ, ఆ రెండు ముఠాల్లోనూ పెతి ఒక్కడికీ మనం కాంట్రాక్టూంట్లో బాకీ వున్నాం గందా. మన మీాచ్చేయి జేసుకు సంపేస్తే ఆళ్ళ డబ్బే పోద్ది. అందికనే మన్టోలి కేవమూ గానేదు" అన్నాడు.

*   *   *

రాత్రి పడుకోబోతూ వుండగా 'అప్పారావు' వచ్చి తలుపు తట్టాడు.

"మరేం లేదు సార్. మీా అప్పు పై నెలకూడా ఇవ్వలేను. ఇవ్వలేనందుకు మనసు తన్నుకుంటూంది. నిద్ర పట్టడం లేదు ......" అన్నాడు.

"నీ దుంపతెగ. ఇప్పుడా చెప్తావు? పొద్దుట రాకూడదూ? ఇక రాత్రి తెల్లవార్లూ నాకు మటుకు ఎలా నిద్ర పడుతుందనుకున్నావు?" అన్నాడు ఋణదాత.

*   *   *

కుటుంబరావుగారు డబ్బు లెక్కసంగతితో తన్నుకుంటూ వుండగా అప్పారావు హఠాత్తుగా వచ్చాడు.

"ఈపళంగా నేను ఇదిగో మీా బాకీ అని పది రూపాయిలు ఠకీమని జేబులోంచి తీసిస్తే ఏమనుకుంటారు ...?" అన్నాడు నవ్వుతూ.

"ఆ చొక్కా ఎవరిదో తొడుక్కొచ్చేశాననుకుంటాను."

* * *

"వత్సా ! నీ భక్తికి మెచ్చితిని వరము కోరుము" అన్నాడు మహావిష్ణువు ప్రత్యక్షమై.

భక్తుడు లేచి, "వరాలమాట దేవుడెరుగ్గాని ముందో ఫైవ్ రుపీస్ ఉంటే ఇవ్వండి చెప్తా. మళ్ళీ ఈసారి మీరు ప్రత్యక్షం అయినపుడు ఇచ్చేస్తాలెండి. బాబ్బాబు,అర్జంటు. లేదనకండి" అన్నాడు హడావిడిగా.

అతని పేరు అప్పారావు.

అతను అప్పులు చేస్తూ వుంటాడు. సర్వాంతర్యామి.

* * *

పునరపి జననం పునరపి మరణం ...అన్న మహా వాక్యంలో తాత్పర్యం దీనికి మూలకారణం ఋణానుబంధమే. ఈ జన్మలో అప్పులు చేస్తే అవి తీర్చడానికి పొరుగు జన్మలో కృషి చేస్తారు జీవులు. అందులో తిరిగి అప్పు చేయడమో, అప్పు ఇవ్వడమో జరుగుతుంది. అప్పు ఇస్తే అది వసూలు చేసుకుందికి మళ్ళీ జన్మ ఎత్తాలి. అందువల్ల అప్పు అడిగేవాడు ఎదురైనపుడు విజ్ఞులు యివ్వననరు. ఇచ్చి పాతజన్మ తాలూకు బకాయి తీర్చేస్తే జనన మరణ చక్రం

నుండి విముక్తి పొందవచ్చునని ఆశ. అందువల్ల 'అప్పారావు'ను సాక్షాత్తు ముక్తిదాతగా గుర్తించ ప్రార్థన.

* * *

"ఏమోయ్ ఓ పాతిక రూపాయలుంటే ఇద్దూ. పెద్దాపురం వెళ్ళిరాగానే ఇచ్చేస్తా" నన్నాడు అప్పారావు.

మిత్రుడు ఇచ్చాడు. ఇచ్చి పాతికేళ్ళు కావచ్చింది. అయినా అప్పారావు అప్పు తీర్చలేదు. మిత్రుడింకోసారి నిలదీసి అడిగాడు.

"నేనింత వరకూ పెద్దాపురం వెళ్ళటం పడకే లేదోయ్." అన్నాడు అప్పారావు.

అప్పుతచ్చులు

(సవరణలు చూడండి)

ఒక పత్రికలో మందుల ప్రకటన ఇలా ఉంది :

"మాచే విశేష వ్యయ ప్రయాసలతో తయారు కాబడిన ఈ మందు ఎంతటి వ్యాధినైనా వారం రోజులలో నయంచేస్తుంది. గ్యారంటీ. అలా కుదరని పక్షంలో జబ్బు వాపసు ఇవ్వగలము."

* * *

'40ల నాటి పత్రికలలో అచ్చు తప్పులను సేకరించి, వాటినిబట్టి కొన్ని కల్పించి ఆరుద్ర ప్రకటించిన అచ్చు తునకలు ఉన్ని కొన్నాయి.

శాతాఖూనీ

పావక మహాశయులారా!

మీా సానుభూతాలతో ఈ శీర్షిక సాటించగలుగు తామని ఆశపుడుతున్నాము. దయుతోసి మీాకు తోలిన ముద్రారతుసాలను మూకు పండించ గోగుకున్నాం.

ఈ వారపు అచ్చు తిప్పులు.

ఆసుపత్రిక వచ్చి చాలా రోగులయింది.

సుభాస్ బాంబు.

దిన పచ్చికలో సంపాద కీరం.

శాంతమ లేక సౌఖ్యము లేదు.

ఇందుకు మా సానుబూతులు.

* * *

ఆంధ్రా టాగూరుగా ఒకాయనను మెచ్చుకోబోతూ ఒక దినపత్రిక పెట్టిన శీర్షిక :

ఆంధ్ర దేశానికి

టాగూరు వంటవాడు.

* * *

ఒక ప్రముఖుడు చనిపోయిన సందర్భంగా ఉత్తర క్రియలపై ఒక పత్రికలో వార్తా నివేదిక :

"బంధు మిత్రులంతా వచ్చారు

నిన్న సాయంకాలం .... వారి ఆస్తినిమజ్జనం జరిగింది."

*    *    *

యుద్ధకాలంలో, ఒక సేనాధిపతి గాయపడి ప్రమాద పరిస్థితిలో వున్నట్టు వార్త వచ్చింది.

సాయంకాలానికి ఎలాగా చనిపోతాడులే అన్న ధీమాకొద్దీ ఒక ద. భా. దినపత్రిక సంపాదకుడు ఆ సేనాని మరణించినట్లుగా పతాక శీర్షిక పెట్టి వార్త ప్రచురించాడు.

సేనాని ఆ పూట చనిపోలేదు. మర్నాడు మధ్యాహ్నం అతడు పోయినట్టు వార్త వచ్చింది.

అందరితోపాటు తిరిగి ఆ వార్తను తాను ఎలా ప్రచురించాలో కుదరక చాలా ఆలోచించి చివరకు ఇలా వ్రాశాడు సంపాదకుడు :

"సేనాని.... నేడు పూర్తిగా మరణించాడు."




[(ప్రై)వేటు) డాక్టర్లను చూడండి]

జరిగితే జరమంత సుఖం లేదన్నారు. ఆ జరుగు బాటు ఆస్పత్రిలో సావకాశ పడితే అది స్వర్గానికోచీడీ తరవాయిగా వుంటుందంటారు అనుభవజ్ఞులు.

ఈ కోవ మనిషి ఒకాయన ఆస్పత్రికి 'చుట్టపు చూపుగా' వెళ్ళి అక్కడ చిలకలా వున్న నరసమ్మని చూసి ముచ్చటపడిపోయాడు.

"సిస్టర్ ! ఒక్కమాట చెప్పనా. మీ వార్డులో పేషెంటుగా చేరి మీ చేతి సపర్యలు పొందుతూ ఉండా లనిపిస్తోంది. అంతకన్న గొప్ప అదృష్టం వుంటుందనుకోను" అన్నాడు ముసిముసి నవ్వులు నవ్వుతూ.

"సార్ ! మీ కోరిక తీరాలంటే వుత్త అదృష్టం చాలదు. అద్భుతం జరగాలి. నేను పురుళ్ళవార్డులో నర్సుని" అంది నర్సు కిలకిల నవ్వి.

* * *

ఆస్పత్రిలో బయటి రోగులకి మందులిచ్చే డిస్పెన్సరీ కిటికీ దగ్గర పూతరేకుల్లా 30 మడతలు పడి వుంది రోగుల క్యూ.

సన్నగా పొట్టిగా వున్న ఒక మీసాలాయన క్యూ లెక్క చేయకుండా ముందుకు వెళ్ళిపోయాడు. ఇద్దరుముగ్గురు కేకవేశారు. చివరి వాళ్ళకి ఒళ్ళుమండి ఆ చివర నిలబడమని తోసేశారు.

అతను మొండిగా మళ్ళీ ముందుకు వచ్చాడు. జనం మళ్ళీ తోసేశారు. ఇలా నాలుగైదు సార్లు జరిగింది. ఐదోసారి అతను లేచి బట్టలు దులుపుకుని "ఇలా అయితే ఇంక అసలు ఈపూట డిస్పెన్సరీ తెరవ నంతే" అన్నాడు కోపంగా.

*　　　　*　　　　*

ఒకాయన సైకిలు మీంచ నించి కిందపడి లేపలేక బాధపడుతున్నాడు.

"పడితే పడ్డారుగాని ఆసుపత్రి గుమ్మంలో పడ్డారు, అదృష్టవంతులు" అన్నాడు దారినపోయే దానయ్య.

"నేనే డాక్టర్నయ్యా స్వామీ" అన్నాడు పడి లేచిన వాడు.

*　　　　*　　　　*

# లోకమంత లోభులా?

ఒక లక్షాధికారి కోటికి పడగెత్తాడని తెలిసి అతని జీవిత విశేషాలు అడగబోయాడు ఒక పత్రిక విలేఖరి.

"మీరు ఇంత డబ్బు ఎలా కూడబెట్టారో చెప్పండి ముందు—అసలు కీలకమైన కారణం కావాలి" అన్నాడు.

"అబ్బో అదంతా ఓ పెద్ద కథ. అడిగారు కాబట్టి చెబుతా. అన్నట్లు మనం మాట్లాడుకుంటున్నపుడు దీపం ఎందుకు నూనిదండుగ. ఆర్పేసి వస్తానుండండి" అంటూ లేచాడు కోటీశ్వరుడు.

"ఇహ మీరేం చెప్పనక్కరలేదండి. అంతా బోధపడింది. వస్తా" అంటూ లేచాడు విలేఖరి.

* * *

ఒక పెద్దమనిషి చనిపోతూ ఆస్తిలో కొంత భాగం ముగ్గురు మిత్రులకు వ్రాశాడు. అయితే ఆ ముగ్గురూ తన చితి మీద ఐదేసి రూపాయలు పడెయ్యాలని షరతు పెట్టాడు.

చిత మీద ఒక ఆసామి ఐదు విచ్చు రూపాయలు పడేశాడు—కరిగాక వెండి తీసుకోవచ్చుగా అంటూ.

వెంటనే రెండో అతను పది రూపాయల కాగితం పడేసి, చితిమీద రూపాయలైదూ తీసుకున్నాడు.

మూఁడో అతను, చితికి నిప్పు పెట్టేశాకా ఆగి చచ్చిన సుబ్బారావుపేర పదిహేను రూపాయలకి చెక్కు రాసి అది జుందులో పడేసి, పదిరూపాయల నోటు తీసుకున్నాడు.

మర్నాడు సాయంకాలానికి ఆ చెక్కు బ్యాంకుకి వచ్చిందనీ సుబ్బారావు స్వయంగావచ్చి మార్చి పదిహేను రూపాయలు తీసుకున్నాడని తెలిసింది. ఈయన పోయినట్టు బ్యాంకుకి తెలీదుట.

*　　*　　*

"మన పెద్ద సెట్టికి నత్తి ఇట్టేపోయింది. ఎలాగోయ్? ఎవరన్నా యోగి........"

"ఎబ్బే, మొన్న చెన్నపట్నంలో ఒక కంపెనీతో ట్రంకు టెలిఫోనుమీాద మాట్లాడ వలసొచ్చింది. ఆ దెబ్బతో ఎక్కడినత్తి అక్కడ ఎగిరిపోయింది.



*　　*　　*

ఒక లుబ్ధుడు తెగించి బైస్కోపు చూడబోయాడు పావలా టిక్కెట్టు కొనుక్కుని. ఆట సాగుతూ వుండగా

పంకా ఊడి అతని నెత్తిన పడింది. బాగా దెబ్బలు తగి లాయి. సినిమా యజమాని కోర్టు కెళ్ళద్దని బతిమాలి నష్టపరిహారంగా వైద్యుడి ఖర్చులు, రెండువేలు రొక్కం, యావజ్జీవితం వుచితంగా సినిమా చూడడానికి పాసు యిచ్చాడు. కట్నం అడక్కుండా అతని కూతుర్ని తన కొడుక్కు చేసుకుంటానని మాట యిచ్చాడు.

అన్ని పుచ్చుకొన్నాక క్షతగాత్రుడు ఇంకా నసుగుతూ మూలుగుతూ కూర్చున్నాడు.

"ఇంకేమి టివ్వమంటారు" అన్నాడు సినిమా హాలు అతను దుఃఖం ఆపుకుంటూ.

"మరేంలేదు. ఆవాళ పావలా యిచ్చి టిక్కట్టు కొని వచ్చాను. బైస్కోపు చివరంటా చూడనేలేదుగదా. ఆ డబ్బులుకూడా వాప సిస్తే..." అన్నాడు ఉబ్బావధాని.

* * *

ముసలాయన రైలాగినప్పుడల్లా దిగి స్టేషనులోకి పరుగెత్తి రైలు కదిలేసరికి ఒగురుస్తూ వచ్చిపడుతున్నాడు రైల్లో. "ఏం కావాలో చెబుతే నే తెస్తాను మీరు హైరాణ పడకండి," అన్నాడో యువకుడు. "అబ్బె, రైలు టిక్కెట్లు కొంటున్నా" అన్నా డాయన. "ప్రతి స్టేషనులోనూనా ?" అన్నాడు యువకుడు.

"మరే బాబూ. సుస్తీ చేసింది. బతకడం కష్టమనీ ప్రాణం ఎప్పుడు పోయినా పోవచ్చనీ చెప్పాడు డాక్టరు.

గారు. ఒక్కసారి చివరకంటా టిక్కెట్టు కొనేశాకా తీరా హారీమంటే దండుగని—పక్కపక్క స్టేషన్లకి కొంటున్నా" అన్నా డాయన ఆయాస పడుతూ.

*　　　*　　　*

"ఏమేవేవేయ్ నేను ఇవాళ బస్సు వెనకే పరుగెత్తు కొచ్చేసి బేడబ్బులు ఆదా చేశాను చూసుకో!" అన్నాడు ఆఫీసునుంచి వచ్చిన భర్త సగర్వంగా ఒగురుస్తూ.

ఆవిడ మూతి విరుచుకుంది. "నిక్షేపంలా టాక్సీ వెనక పరిగెడితే మూడు రూపాయలు ఆదా అయ్యేదిగదా" అంది బేడకాసు లాక్కుంటూ.

*　　　*　　　*

"రాత్రి నాటకానికి మీరు రాలేదుగాని పిన్నిగారూ మహా బావుంది. జనం బాగానే వచ్చారు. సగం హాలు నిండింది."

"పోదూ సీక బుర్రకేం. సగం హాలంతా కాళీగేనుట. మావారు చెప్పారు."

*　　　*　　　*

ఇరుగు పొరుగులుగా వుండి విడిపోయిన అమ్మలక్క లిద్దరు ఒక పేరంటంలో కలుసుకున్నారు.

"మా కిప్పుడు మంచి పొరుగు దొరికింది. హాయిగా వున్నాం పోరు లేకుండా!" అంది ఒకావిడ.

"మేమూ అంతే. మాకు మంచి పొరుగు దొరికి, మేమూ హాయిగా వున్నాం పోరు లేకుండా."

"ఏమిటి మీరు ఆ యిల్లు మారారా?"

"లేదు మేం అక్కడే వున్నాం మీ రెళ్ళాక"

* * *

ఫైరాఫీసులో ఫోను గణగణ మోగింది.

"హలో. ఎక్కడండీ అగ్ని ప్రమాదం?" అన్నాడు అగ్నిమాపక దళోద్యోగి.

"చూడండి మావారు మొన్న సెల్వకెళ్ళినప్పుడు మళ్ళీ కొన్ని కొత్త మొక్కల విత్తనాలు తెచ్చారు ..." అంది ఫోనులో కంఠం.

"హలో! నిప్పెక్కడండీ?"

"....అవి ఇప్పుడే పైకి వచ్చాయి. లేత మొక్కలన్నమాట ........"

"నిప్పెక్కడండీ?"

"....గులాబీల వరస, క్రోటన్ కుండీలూ అవీ మీరు చూసేవుంటారు ..."

"నిప్పెక్కడంటే చెప్పవేమిటమ్మా?...."

"అన్నీ బోలెడు డబ్బుపోసి శ్రమపడి పెంచిన మొక్కలు. ఆ తోట మా ప్రాణం లాటిది"

"దేవుడా! ఎందుకు పోను చేశావమ్మా? మీ తోట గోల మా కెందుకు. కొంపకి నిప్పంటుకోలేదా... "

"వస్తున్నా, వస్తున్నా. అది చెబుదామనే. మంట లార్పే సందడిలో మా తోటమటుకు తొక్కకుండా మీ వాళ్ళని అదుపాజ్ఞల్లో పెట్టండి. మరేం లేదు. మా పొరుగు వాళ్ళింటికి నిప్పంటుకొంది. చప్పున రండి. ఆ కాకకి మా మొక్కలు వాడిపోతున్నాయి."




ఒక రచయిత పత్రిక ఆఫీసుకు వచ్చి పెద్దకట్ట (రచనలు) బల్లమీద పడేశాడు. "అయ్యా నా లేత రెక్కలు విప్పి సారస్వత ప్రపంచంలోకి ఎగిరి వచ్చానండి. రచనలు చేసి పత్రికలకు అమ్మి జీవించాలని ఆశయం," అన్నాడు.

"ఓహో. ఏవైనా అమ్మేరా?"

"ఇంతవరకు నా సైకిలు, రిస్టువాచి, ఉంగరం, పోగులూ అమ్మేనండి"

*　　　*　　　*

కాదలచుకున్న మహాకవి నరసయ్య, అంతపనీ చేసే లోగా డబ్బులేక, రాక, అద్దె బకాయి పడ్డాడు. ఇంటాయన వెళ్ళగొట్టడానికి వచ్చాడు.

"చూడండి సార్ తొందరపడకండి. ఈనాడు నేను అనామకుడిని కావచ్చు. కాని త్వరలో నా రచనలు మహా కావ్యాలై నేను మహాకవిని కాగానే ఈ ఇంటికి ఖ్యాతి కలుగుతుంది. వేలాదిజనంవచ్చి మహాకవి నరసయ్యగారు ఒకప్పుడు రచనలు చేసింది ఈ గృహంలోనే అని చెప్పు కుంటారు కొన్నాళ్ళలో...."

"ఎన్నేళ్ళెందుకు. ఇవాళ సాయంత్రానికి మీరు అద్దె కట్టకపోతే, రేపొద్దుటినుంచే చెప్పుకుంటారు." అన్నాడు ఇంటాయన.

*　　　*　　　*

"ఏవండీ కుంపటి అంటించే చిత్తుకాగితాలయి పోయాయి. ఎలాగా?"

"అలాగా. అయితే వుండు ఈ పూట పిల్లలకి పరీక్ష పెడతాను"

"ఎందుకండీ! ఇవాళ మీ రచనలు పత్రికల్నించి తిరిగివచ్చే రోజుగా?"

* * *




(కర్మదాయం కాదు)

"ఏవోయ్ రంగా! మొన్న మశూచికం పోసి చసి పోయింది నువ్వా, మీ అన్నతమ్ముడా....?" అని అడిగాడో కాయన.

"నేనేనండీ" అన్నాడు రంగడు వినయంగా.

పెద్దాయనకేం పాలుపోక మాటతో చక "బతే చసుత్కారివే," అంటూ రంగయ్య భుజం తట్టాడు. చేతికేం తగల్లేదు. రంగయ్య మాయమైపోయింది.

* * *

"హలో కులాసా?" అన్నాడు అప్పారావు.

"అరె. మళ్ళీ ఎలా వచ్చావురా! నువ్వామన్న

చచ్చిపోయావుగా, మళ్ళీ ఎలా వచ్చావు ? నువ్వు చావ లేదా?" అన్నాడు రెడ్డి జేబు గట్టిగా పట్టుకుని.

"చావకేం నిక్షేపంలా చచ్చాను. నా దహనానికీ దానికీ నువ్వేగా అప్పిచ్చావు మా అన్నయ్యాకి?"

"మరి. మరి మళ్ళీ ఎలా వచ్చావు?"

"నేను రాలేదు. నువ్వే వచ్చావు....నువు చచ్చి పోయి గంటయింది" అన్నాడు అప్పారావు.

* * *




"నా కొత్త నవలమీద పత్రికలో విమర్శ వేయించండి" అంటూ రచయిత ఒక పుస్తకం అందించాడు.

పుస్తకం బాగా నలిగి చిరిగిపోయింది.

"పబ్లిషర్ నాకు ఒకటే కాపీ ఇచ్చాడండీ. మా అబ్బాయి దాన్ని పొద్దునే నలిపి చింపేశాడు. అంతే మరోలా అనుకోకండి," అన్నాడు రచయిత.

"అయితే ఇంకా మా విమర్శ ఎందుకు ? మీ

అబ్బాయి అభిప్రాయం తెలుస్తూనే వుందిగా" అన్నాడు సంపాదకుడు.

*　　*　　*




"భవతీ భిక్షాం దేహి" అన్నాడు యాచక శాస్త్రి.

"ఇస్తారా ఇవ్వరా చెప్పండి" అన్నాడు యాచక రాజు.

"ఎట్టమ్మాయెట్టు. ఈ జన్మలో ఎట్టావో పైజనమలో పట్టెడు బోరుకుద్ది. మద్దిన్నాకేటి" అన్నాడు యాచక శ్రేష్ఠి.

"ఆ యెడం చేత్తో కాసిని బియ్యం ఇటుగూడా తగలెయ్యండి" అన్నాడు యాచక 'రావు'.

"అందులో కాసిని నా కివ్వరాదూ" అన్నది పీర ముష్ఠి.

*　　*　　*

"గా బూ కుంటోడికి కాసి డబ్బియండి బాబూ"

"అదేవిట్రా నీ కాళ్ళు విశేషంలా వుంటే"

"నాకాకాదులెండి. రోజూ యిక్కడ కూకొనే కుం టోడియ్యాల మాట్నీకెల్లాడు. ఆడి తరుపున నానుకూకున్నా. మంది సెవుడు, మూగ, గుడ్డి లెండి. యీ యిన్టి (E.N.T.) డిపాట్రుమెంటన్నమాట"

*   *   *

రివాజుగా ధర్మం చేసే ఆసామిని చూడగానే చెయి జాచాడు యాచకుడు



"అర్జంటు పనిమీద పోతున్నా, వచ్చే టప్పుడుయిస్తాలే" అన్నాడాయన.

"అరువు లెట్టకండి బాబయ్యా! అరువులవల్ల శానా నష్ట పోయానేను."

*   *   *

నిగనిగ లాడుతున్న కొత్తకారులోంచి చెయ్యి ఒకటి యివతలికి వచ్చింది. 'బాబూ, కానీ' అందిలో పలి కంఠం.

"ఇదేమిటీ వరస?" అన్నాడు దానయ్య తెల్లబోయి.

"లాట్రీలో కారొచ్చిందండి. పెట్రోలికి డబ్బుల్లే

వుగా. అందుకని యిక్కడే కూర్చొని మామూలుగా ముష్టెత్తుకుంటున్నాను" అన్నాడు కారులో యాచకుడు.

*  *  *




సంగీతానికీ హాస్యానికీ యితరత్రా బంధుత్వం మాట ఎలావున్నా సంగీతం మీంచి సంగీతం లోంచి చాలా హాస్యం ఆవిర్భవించింది

నాటకంలో సావిత్రి వేషం వేసి నావిడ 'ఏడవడం బాగా రాదండీ, అంటే,' దానికేం మీకు తోచిన పాట పాడేస్తేసరి' అన్నాడు కంట్రాక్టరు.

*  *  *

న్యాయమూర్తి ఒక కేసులో ముద్దాయికి శిక్ష విధించబోతూ "నిన్నెక్కడో చూచినట్టుందే. ఎక్కడ చెప్మా" అన్నారు.

"చిత్తం మీరు ప్లీడరుగా వున్నప్పుడు మీ రెండో అమ్మాయికి సంగీతం చెప్పడానికొచ్చే వాడినండీ...."

"అలాగా! అయితే యిరవైయేళ్ళు ఖైదు విధిస్తున్నాను."

* * *




* * *

ఒక గాయకుడు అడవిలో కూర్చొని పాడుతూవుంటే సింహాలూ, ఏనుగులూ, పులులూ, చిరుతలూ వగైరాలన్నీ చుట్టూచేరి విని ఆనందిస్తున్నాయి. ఒక చిరుతపులి మాత్రం హఠాత్తుగా దూకి గాయకుడిని మింగేసింది.

మిగతా జంతువులన్నీ దాన్ని మొఖం వాచేలా చివాట్లు పెట్టాయి. "అంత చక్కగా పాడుతున్న వాడినెలా పొట్టబెట్టుకున్నావు?" అని.

'ఛా! పాడుతున్నాడా! నాకాస్త చెముడుగదూ వినబడలేదు" అని నాలిక్కరచుకుంది చిరుతపులి.

* * *




భర్తచేత ఎలాగేనా సిగరెట్లు మాన్పించాలని మెల్లిగా మళ్ళీ దాడి ఆరంభించింది ధర్మపత్ని.

"అసల్నాకు తెలీకడుగుతా. అంత యిదిగా కాలుస్తారే. ఆ సిగరెట్లలో ఏముంటుందీ అని!" అంది.

"పొగాకు" అని అక్కణ్ణించి లేచిపోయాడు మహేశ్వర్రావు.

* * *

చిరాగ్గావున్న భర్తని పరాగ్గావున్న భార్య పిలిచి 'ఈపూట అరిటికాయొండనా, వంకాయొండనా?' అంది.

"నా తలకాయ వండు".

"ఆవపెట్టి ఎండనా? నేయించేయమంటారా?"

*　　　*　　　*

ఒక ధర్మయ్యా, అతని ధర్మపత్నీ హొరుగూరు పోతు న్నారు. అర్ధాంగి కొంచెం వెనక నడుస్తోంది. హఠాత్తుగా ఓ కోడెదూడ ఎక్కడనుంచో వచ్చి ఒక్క పరుగున వెళ్ళి ధర్మయ్యని వెనకనించి ముట్టెతో తట్టింది. ఆయన ఎగిరిపడి లేచి మళ్ళీ నడుస్తున్నాడు. దూడ మళ్ళీ పరుగెత్తి కొమ్ము లతో పైకెత్తి కొట్టింది. అక్కడితో ఆయనకి ఓపిక పోయింది.

"పోన్లే శాంతా. పబ్లీకున ఏవిటా మోటసరసం !" అన్నాడు తలవంచుకుని ముందుకుపోతూ.

*　　　*　　　*

ముద్దరాలికి ముచ్చటైన అనుమానం వచ్చింది.

"ఏవండీ, ఏవండీ ! ఆ వెధవ పేపరలా పారేసి, ముంద రిది చెప్పండి. ఏవండీ! నేనివాళరాత్రి చచ్చిపోతా ననుకోండి! మళ్ళీ పెళ్ళి చేసుకుంటారా మీరు?" అంది భర్తని కుదిపి.

"అబ్బే వీల్లేదు యివాళ రాత్రి కుదరదు. పనుంది" అన్నాడు పేపర్లో భర్త.

* * *

ఒకాయన చక్కటి చిలుకను కొని ఇంటికి తీసుకెళ్ళాడు. ఇంట్లో చిలకమ్మ చాలా ముచ్చట పడింది.

"అవుగాని దీనికి రెండుకాళ్ళకి దారాలు కట్టారెందుకండీ?" అంది పరకాయించి చూసి.

"ఒకటి లాగిచూడు" అన్నాడు భర్త.

కుడికాలు దారం పట్టుకు లాగిందావిడ.

"నమస్కారం. దయచెయ్యండి. అలాకూర్చోండి" అంది చిలక.

రెండో కాలు లాగింది ఇల్లాలు.

"సెలవండి. ఉంటానుమరి" అంది చిలక.

"ఏమండీ, రెండుకాళ్ళ దారాలూ ఒక్కసారే లాగితే ఏమంటుందో?" అంది చిలకల కొలికి.

"ఏమనడ మేవిటి మీ మొహం. రెండు కాళ్ళూ పట్టుకు లాగితే కిందపడనూ?" అంది చిలక చిరాగ్గా.

* * *

ముందు వరసలో చిలకా గోరింక జంట ఒక్కలా ఎడ తెరిపి లేకుండా మాట్లాడుకుని నవ్వుకుంటున్నారు. వెనక వరసలో పెద్ద మనిషికి కొంతసేపయ్యాక ఓపిక చచ్చి పోయింది.

"బాబూ, ఇందాకట్నించి చూస్తున్నాను. నాకు ఒక్కమాట వినబట్టంలేదు" అన్నాడు కోపంగా ముందుకు వంగి.

ముందు వరసలో భర్త మరింత కోపంగా వెనక్కి తిరిగి :

"బాగుందండీ. మా మాటలు వినాల్సిన అవసర మేమిటి మీకు ? పైగా వినబడలేదని ఫిర్యాదా ? ఇదేం మర్యాదా!" అన్నాడు.

* * *

"ఏవండీ విన్నారా? పొరుగింటి సుశీలా, మొగుడూ ఈ వేసంగులికి రేపు ఊటి వెళ్ళిపోతున్నార్ట చక్కహా"

"భేష్. ఇంకేం. అయితే మనం ఇల్లు కదలక్కరలేదు, వాళ్ళు రేపు పోతారు కాబట్టి, ఎల్లుండి మనం కొడైకెనాల్ వెళ్ళలేదని వాళ్ళకి తెలీదుగా?"

* * *

ఒకావిడ డాక్టరు దగ్గర కెళ్ళి, "మా వారికి కలవరింతలండీ, చంపేస్తున్నారు" అంది.

"మందిస్తాను పట్టికెళ్ళండి. అవే పోతాయి...."



"అబ్బే, పోడానికివ్వకండి. కాస్త స్పష్టంగా మాట తెలిసేలా కలవరించడానికి మందివ్వండి .... ఆ పిల్లపేరు తెలీటం లేదు."

* * *

తల్లి దగ్గరఉండి కొడుకుచేత కూరలు తరిగిస్తోంది.

"అదేమిటే నేను వంటచేస్తున్నానుగదాని వాడిచేత కూడా చేయిస్తావా!" అన్నాడు భర్త తటపటాయించి.

"బావుందండీ. రేపు వాడికిమటుకు పెళ్ళి కాదూ?"

* * *

ఒక భర్త ఆర్తనాదం :

"వందేళ్ళనాడు భూప్రదక్షిణం చెయ్యడానికి ఎనభై రోజులు పట్టిందిట. ఇప్పుడు ఎనిమిదిరోజులలో అయిపోతోంది. పూర్వం ఢిల్లీ వెళ్ళాలంటే మూడు రోజులు పట్టేది. ఇప్పుడు విమాన మెక్కితే ఒక పూటచాలు. పూర్వం జాబు అందడానికి వారాలకొద్దీ పట్టేది, నేడో క్షణాలమీద వెళ్ళిపోతున్నాయి. నీ చీర సింగారింపు పూర్వం మూడు గంటలు పట్టేది, ఇప్పుడూ అంతే పడుతోంది. ఎప్పుడూ ఇంతేనా?"

*    *    *

అనసూయ భర్త భోజనం వరసచూసి నొచ్చుకుంది.

"ఏవిటండీ నానాటికీ మీకు తిక్క హెచ్చిపోతోంది. చూస్తున్నాగా.... సోంవారం వంకాయకూర చేస్తే అద్భుతంగా వుందన్నారు. మంగళవారం వంకాయకూరొండితే బాగుందన్నారు. బుధవారం వంకాయ కూరొండితే భేషుగ్గా వుందన్నారు. లక్షింవారం వంకాయ కూరొండితే తిన్నారు. సుక్కురారం వంకాయకూరొండితే తీరా వడ్డించాక వంకాయ సయించదంటారు. ఏమిటంట మీ యిది, సవబుండాలి."

*    *    *




"అయ్యా, నమస్కారం దయచేయండి."

"........ భక్తితో మదర్పిత చందన తాంబూలాదులు స్వీకరించి నన్నానందింపజేయ .... అంటూ

శుభరేఖల్లో బంధువులందరికీ రసుకుపోతాంగాని కొందర్ని చూస్తే ఒళ్ళు చిర్రెత్తిపోదూ?...." అన్నాడు అవధాన్లు గారు.

"అదేం మ్మాట.. నన్నడిగితే పనికిమాలిన బంధువు, బాధపెట్టే బంధువు అంటూ ఎవ్వడూ లేడు. కొందరు వచ్చి ఆనంద పెడతారు; మరికొందరు వెళ్ళి ఆనందపెడతారు. అందరున్నూ ఆనందపెట్టేవారే," అన్నారు శాస్త్రిలవారు.

* * *

"దూరపు బంధువంటే ఎవర్రా బాబీ"

"ఎప్పుడూ మెడ్రాసులోనే వుండిపోయి మనింటికి అస్సలు రానివాడు."

"దగ్గిర బంధువంటే?"

"ఎప్పుడూ మనింటోనే వుండిపోయేవాడు"

* * *

సుబ్బారావు బామ్మగారు తిరుపతెళ్తూ మనవడింట దిగింది. భార్యా భర్త లిద్దరూ విపరీతమైన మర్యాద చేశారు. అంతకు ముందురోజే దిగిన సుబ్బారావు అత్త గారికి వరస నచ్చక రుసరుస లాడసాగింది.

దీపదీపాలవేళ కూతురు నట్టింటో కెళ్ళేసరికి త్రప్పి

తారట్లాడుతున్నట్టు కనపడింది. ఇదే అదనని దగ్గర కెళ్ళి "చూడమ్మా, ఆ ముసలిపీనుక్కి అంతలేసి మర్యాద లేవి టని విసుక్కోకు. పదివేల రూపాయల ఆస్తిట. అంతా మీ అల్లుడికి రాస్తుంది రేపు హరీమంటే. నువ్వుకూడా కాస్త సగదాగా వుండు" అంది.

"ఏమిటే అవ్వా మనువరాళ్ళూ చీకట్లో ముచ్చట్లా డుతున్నారు?" అంటూ సుబ్బారావు అత్తగారు పెరట్లోంచి లోపలి కొచ్చింది.

*　　　*　　　*

లక్షాధికారి చనిపోయాడు, సావిట్లో అయిన వాళ్ళంతా శోకాలు పెడుతున్నారు. అందరికన్నా కాస్త ధాటీగా ఏడుస్తున్నా డొకాయన.

"మీ రెందుకండీ అంత గట్టిగా ఏడుస్తారు? అసలు వాళ్ళ ఏడుపు సరిగ్గా వినపడనీకుండా? చచ్చినాయన మీకే మన్నా బంధువా?" అన్నాడు ఇద్దర్నీ ఎరుగున్న ఒక ఆసామి.

"కాదండీ. అందుకే ఈ ఏడుపు"

*　　　*　　　*

చమత్కారాలు -



"ఏవోయ్ హనుమాన్లూ మీవూళ్ళో పెద్దవాళ్ళెవ రైనా పుట్టారా?" అన్నాడు పల్లెటూరు వచ్చిన పెద్దమనిషి.

"లేదండీ. అంతా చిన్న చిన్న పిల్లలే పుడుతు న్నారు."

* * *

"ఈ రోడ్డెక్కడి కెళ్తుందయ్యా?"

"పాతికేళ్ళాయి చూస్తున్నాను, కదలకుండా ఇక్కడే పడుందండి."

* * *

"బాబూ! రంగయ్యగారిల్లెక్కడా?"

"ఎక్కడండీ. ఇల్లెక్కడాని కాయనకేం పని? పైగా పెద్దవాడు."

* * *

"బ్రదర్, నీకు మొన్న పెళ్ళయిందట. ఎవర్ని చేసు కున్నావ్?"

'ఆడపిల్లని'

'బలేవాడివే. ఆడపిల్లని కాకపోతే మొగాణ్ణి చేసుకుంటారేమిటి."

"అదేంమ్మాటా? మొన్న మా చెల్లెలు మొగాణ్ణి పెళ్ళాడలేమా"

*　　　*　　　*




*　　　*　　　*

"అమ్మల గన్న యమ్మ!"—అంటే ఎవరురా?

"అమ్మమ్మండీ!"

♦　　　♦　　　♦

మీ పేరు తెలుసుకోవచ్చా?
ఆహా, నిక్షేపంలా దానికేం భాగ్యం.

*　　*　　*

మీ వూళ్ళో పేరుగలవా ళ్ళెవరైనా పుట్టారోయ్ ?
లేదండీ. అందరికీ పుట్టాకే పేర్లు పెడుతున్నారు.

*　　*　　*

"చెప్పినమాట వినమంటే నీక్కాదూ?"
"చెప్పాడు మాటలు వినొద్దని మీరేగదండీ చెప్పారు?"
"అదిమట్టు కెందుకు విన్నట్టూ?"

*　　*　　*

ఒకాయన గడియారాల షాపు కెళ్ళి గడుసుగా అడిగాడు.

"ఏవండీ, గడియారం పదమూడు గంటలు కొడితే ఏ వేళైందంటారు?"

"మరమ్మత్తు వేళ" అన్నాడు షాపువాడు.

*　　*　　*

"'ఆదివారం శలవు' అని నిన్న బోర్డువేసి ఇవాళ షాపు తీశారేమండీ?"

"ఆదివారం ఆఫీసులకి శలవుకాబట్టి ఈ దుకాణానికి వచ్చి నాలుగూ కొనుక్కోవలసిందని హెచ్చరికకి."

*     *     *

"ఏవండి సబ్బు లున్నాయా?"
"లేవండీ"
"హేరాయిలుందా?"
"లేదుసార్"
"టూత్ పేస్టో?"
"అదీ లేదండీ"
"తెల్లకాయితాలు?"
"అయిపోయాయి"
"షాపు తాళం కప్పలున్నాయా?"
"వున్నాయి"
"అయితే కొట్టు తలుపేసి తాళం బిగించండి"

*     *     *

"ఈ వెధవ కాఫీ మానేస్తే, ఆ మిగిల్చే డబ్బుతో సుబ్బరంగా పుణ్యక్షేత్రాలన్నీ చూసిరావచ్చు" అంది అత్తగారు—సోడల్ని కూకలేస్తూ.

"దానికేం. భోజనం మానేస్తే ఏకంగా వైకుంఠం వేం చూడొచ్చుగా," అంది వియ్యపురాలు.

*　　　*　　　*

ఎదుగూ బొదుగూ లేనివేమిటని మేష్టారుగారు అడిగారు.

"గొర్రెతోక" అన్నాడు ఎదుగూ బొదుగూ లేని విద్యార్థి.

"సరే, నీబుర్రకూడా వొకటనుకో," అన్నాడు మేష్టారు.

"తెలుగు సినిమా," అన్నాడు ఎడిటరుగారబ్బాయి.

"నీ జీతం నాన్నా" అన్నాడు సుపుత్రుడు.

"వడ్డీలేని అప్పు" అన్నాడు సెట్టిగారబ్బాయి.

"సినిమా తార వయసు" అన్నాడు ఎదుగుతున్న బిడ్డడు.

*　　　*　　　*

తలా తోకా లేనివి: తెలుగు సినిమాకథ; ఎన్నికల వాగ్దానాలు.

*　　　*　　　*

ఆగనిది : మూడే ముక్కలు చెప్పి విరమిస్తా అని ఆరంభించే వక్త ఉపన్యాసం.



*　　　*　　　*

"కాకపోయినా అంత లేసి మీసాలేవిఁటి. మీసాలతో కాఫీ అదీ తాగడం కష్టం కాదండీ?" అంది అర్థాంగి.

"కష్టమేవిటి, అసాధ్యం. అంచేతే నేను మీసాలతో ఏదీ తాగను. నోటితోనే తాగుతాను," అన్నాడు భర్త.

*  *  *

"సున్న ఉభయాక్షరం అంటారెంచేత?"

"అది తెలుగులోనూ, లెక్కల్లోనూ వస్తుందని"

*  *  *

ఒక సాధువూ, శిష్యుడూ శ్మశానానికి అడ్డపడి పోతున్నారు.

శిష్యుడిని హడలగొట్టాలని, సాధువు ఒక పుర్రె తీసి "ఇది రావణాసురుడి పుర్రె" అన్నాడు.

"గురూ, ఆయన పెద్ద రాక్షసుడుగదా పుర్రె ఇంత చిన్నదిగా వుందేం?" అన్నాడు శిష్యుడు.

"ఇది చిన్నప్పటిదిలే" అంటూ చురుగ్గా ముందడుగేశాడు సాధువు.

*  *  *

"అయ్యా, ఆసుపత్రికి దగ్గర దారేదో చెప్పగలరా?"

"గలను," అన్నాడు చమత్కారి.

ఇంకో ఆసామి చెప్పిన దారి: "కళ్ళుమూసుకు రోడ్డు మధ్య పదినిమిషాలు నడవండి. కళ్ళు తెరిచేసరికి ఆస్పత్రిలో వుంటారు"

* * *

"నాకు ఈ పళంగా సరిగ్గా బిర్లాగారి కున్నంత ఆస్తి వచ్చేసిందనుకో, అప్పుడు నేను బిర్లాకన్న గొప్పవాడి నయిపోతాను," అన్నాడు కిలీకొట్టు వీర్రాజు.

"అదెలాగ. బిర్లాకున్నంత ఆస్తివస్తే సరిగ్గా అంతే గొప్పవాడివవుతావు గదా"

"బలేవాడివే. ఆ ఆస్తి ప్లస్ ఈ కిల్లీ బడ్డీగదా. ఇది బిర్లాకి లేదుగా మరి".

* * *

"ఈ పూట మీ యింటో కూరేం చేశారు?"

"ఏం చేస్తాం, తిన్నాం."

* * *

ఓ చమత్కార పిల్లడు, అతి చమత్కారంగా

మాట్లాడి అందరినీ హేళనజేసే ఒకానొక మిఠాయివాలా కొట్టుమీద కెళ్ళి ఓ పావలా పకోడీలు కట్టమన్నాడు.

పొట్లం అందుకుని ఓ క్షణం పట్టుకుని

"ఇవొద్దుగాని ఈ పావలా పకోడీల బదులుమిఠాయి కట్టి ఇయ్యి" అన్నాడు అది వాపసు ఇచ్చి.

మిఠాయిపొట్లం చేతి కివ్వగానే డబ్బు చెల్లించ కుండా పోబోయాడు. దుకాణదారు డబ్బు లడిగాడు.

"డబ్బేమిటి. పావలా పకోడీల పొట్లం బదులు ఈ మిఠాయి తీసుకున్నాను. చెల్లుగా" అన్నాడు కుర్రాడు.

"ఓహో అలాగేం. పోన్లే పకోడీల పొట్లానికి పావలా ఇచ్చి వెళ్ళు" అన్నాడు దుకాణదారుడుగడుసుగా.

"ఎందుకూ? పకోడీల పొట్లం నేను తీసుకోలేదుగా?" అన్నాడు కుర్రాడు.

* * *

## కులగారగంప

ఎత్తిపొడుపులు:

"చూడండీ చీరలు కొనమంటే కొను(రు). చూడండీ, నా చీరా నా వాలకం. ఎవరన్నా చూస్తే వంట మనిషి ననుకుంటారు" అంది ఇల్లాలు.

"ఆ, ఓ పూట మనింటో భోజనం పెట్టు. వాళ్ళకే బుద్ధొస్తుంది."

* * *

"పిచ్చిచేష్టలు మానేయ్. నా చిన్నప్పుడు, గోళ్ళు కొరుక్కుంటే జడ్డివెధవనవుతానని చెప్పేవారు మా తాత గారు."

"ఆయన మాటవిని మానెయ్యవలసింది నువ్వు"

* * *

కలలు

"అదేం విచిత్రమోగాని నా గదినిండా అందమైన సినిమాతారల బొమ్మలు పెట్టుకుంటానా అండీ—"

"వాళ్ళు కల్లో కొస్తారు కాబోలు అదేనా?"

"ఎబ్బే వాళ్ళొస్తే చెప్పేదేముంది — ఎంతసేపూ ఆ విలను వేషాలవాళ్ళు అఘోరిస్తారు కలల్నిండా."

◆ ◆ ◆

"అయ్యా పోలీసువారూ, చప్పున నన్ను ఖైదులో వేసి తాళం పెట్టండి. మీకు పుణ్యం వుంటుంది" అన్నాడొకాయన ఒగురుస్తూ వచ్చి.

"ఏం చేశారండీ?"

"మా ఆవిడని కర్రతో కొట్టాను."

"చచ్చిపోయిందా."

"లేదండీ. అందుకే ముందు ఖైదులో వేసెయ్యండి నన్ను."

◆ ◆ ◆




◆ ◆ ◆




*　　　*　　　*

సుబ్బారావుగారు పకపక నవ్వి, "ఏమయ్యో! ఇదెప్పట్నించి? నీ కంచం నువ్వే కడుక్కోడం?" అన్నాడు.

"అబ్బే, ఎన్నడూ లేదు!" అన్నాడు చక్రవర్తి.

"ఆ, ఇందాక నా కళ్ళతో నేను చూస్తిస్తే"

"పిచ్చివాడా. అది నాదికాదోయ్, మా ఆవిడతిన్న కంచం" అన్నాడు చక్రవర్తి విరగబడి నవ్వుతూ.

*　　　*　　　*

"అవునుగానీ—అమ్మాయ్ నీ చేతిలో ఎప్పుడూ డబ్బు ఆడుతుందిగదా—మీ ఆయనన్నలా అంత చెప్పు చేతల్లో ఎలా పెట్టుకున్నావే?...."

"ఏంలేదు పిన్నీ. నాకు కోపం వచ్చినప్పుడల్లా మా పుట్టింటికి వెళ్ళిపోతానంటాను. అన్నప్పుడల్లా ఆయన రైలు ఛార్జీలకని పాతిక రంగున తీసిస్తారు. ఆ తరవాత నేను వెళ్ళడం మానేస్తాను. ఎప్పుడూ ఇంతే."

* * *

"ఏవండీ, మీ కోసం పాలకోవా చేసిపెట్టాను. మన కుక్క తినేసిందండీ" అంది ఇల్లాలు దీనంగా.

"పోన్లే. మరో కుక్కని కొనిస్తాను ఏడవకు" అన్నాడు భర్త.

* * *




"ఏవిటోయ్. ఇవాళ వంకాయకూర ఇలా తగలే

కారు. కంపుకూడాను. కిందటిసారి అంత బాగుందే మరి ”

“బలేవారే. ఇది ఆ కూరేనండి. నుల్లి ఎక్కడ వండాం——? మీరు వంటవాడు నాగాడని పేరుపెడతారు గాని——”

*  *  *

ఒకతను కాఫీ తెప్పించి సర్వర్ను పిలిచి, “చూశావా, ఇందులో ఈగ వుంది” అన్నాడు హేళనగా.

“బేడ కాఫీకి ఈగలుగాకపోతే ఏనుగు లొస్తాయి టండీ?” అన్నాడు సర్వరు.

*  *  *

హోటల్లో జనం పల్చగా వున్నారు. సర్వరు మిత్రులతో కబుర్లు చెబుతున్నాడు, “అదిగో, ఆ మూల బల్లమీద మీసాలాయన్ని చూశావా? బ్రహ్మ చెవుడులే. తమాషా చేస్తాను చూడు” అంటూ అతని దగ్గరకు వెళ్ళి “ఏరా మీసాల వెధవా, ఏం మింగదల్చుకున్నావు? గేదెలా వున్నావు. కాసేపు పిండి రుబ్బిపెట్టరాదూ?” అన్నాడు మెల్లిగా వినయం అభినయిస్తూ.

సర్వరు మిత్రులంతా విరగబడి నవ్వారు.

"ఓ కప్పు స్ట్రాంగ్ కాఫీ, కాసిని మంచినీళ్ళు పట్రా.... ఇదిగో చూడబ్బాయ్. చెవుడు నాక్కాదు మా అన్నయ్యకి," అన్నాడు మీసాలాయన మృదువుగా.

*   *   *

"రాయలసీమనించి ఇంకో మెమోరాండం వచ్చిందండీ. ఎక్కడా నీటిబొట్టు లేదట. జనం నాలుకలు పిడచ కట్టుకుపోతున్నాయట" అని నివేదించాడు కార్యదర్శి.

"ఆ పోదూ మరీ బడాయి. బొత్తిగా ఆపాటి నీళ్ళుండవా?" అన్నాడు మంత్రిగారు.

"నమ్మొచ్చుననుకుంటానండీ. ఈసారి ఈ ఉత్తరం పెట్టిన కవరుమీద పోస్టుబిళ్ళని గుండుసూదితో గుచ్చి పంపారండీ."

*   *   *

"నాకు మతిమరుపు మహాయిదిగా ఉందండీ. ఏదీ ఒక్కక్షణంకూడా గుర్తుండదు" అన్నాడు రోగి.

డాక్టరు ఒక్క క్షణం పరకాయించి చూసి, "ఎంత కాలంనుంచి ఇలా వుంది?" అన్నాడు.

"ఏది ఎంతకాలంనించి అంటారు?" అన్నాడు రోగి తెల్లబోయి.

* * *

ఒకాయన క్షౌరశాలకు వెళ్ళి గడ్డం చెయ్యమన్నాడు. రెండునిముషాల తరవాత, "అబ్బాయ్, ఇంకో కత్తి వుంటే ఇలా యిద్దూ" అన్నాడు.

"ఏం మీరే చేసుకుంటానంటారా?"

"అబ్బె, ఆత్మరక్షణకోసం".




* * *

రెండు ప్రశ్నలకు పది రూపాయిలు అని బోర్డుకట్టి కూర్చున్న ఒక జ్యోతిష్కుడి దగ్గరకు వెళ్ళి, "అయితే రెండు ప్రశ్నలకు పదిరూపాయిలు పుచ్చుకుంటారా?" అన్నాడు.

"అవునండీ. మీ రెండో ప్రశ్న ఏమిటి?" అన్నాడు జోతిష్కుడు.

* * *

ఒక ప్రౌఢ మహిళ వయసు మళ్ళిందని భయపడి ఒక వైద్యుడిదగ్గరకు వెళ్ళి, "నన్ను మళ్ళీ పాతికేళ్ళ యువతిగా మార్చడానికేం తీసుకుంటారు?" అంది.

"రెండువేల రూపాయిలు"

"15 ఏళ్ళ పిల్లగా మార్చాలంటే?"

"ఇరవైవేలు"

సరేనం దావిడ. రెండు నెలల్లో వైద్యం పూర్తి అయింది. ఆమె 15 ఏళ్ల బాలగా మారింది. కాని డాక్టరుకు డబ్బివ్వనంది.

కోర్టులో దావా వేస్తా నన్నాడు వైద్యుడు.

"వేసుకోండి. నాకు 15 ఏళ్ళు. మైనరును. దావాలు గీవాలు పనిచెయ్యవు" అంది ప్రౌఢ బాల.

* * *

"ఇదే లోకం? మీరుగినా యములాళ్ళా?" అన్నాడు కాళ్లారి పడి లేచి రాగుడన.

కొంచెం వంగినిలబడ్డాయన పరిచయాలు ఆరంభించాడు. "అయ్యా! వీరు డాక్టరుగారు, మీరు ఫీజుకి ఒప్పుకోగానే వైద్యం చేస్తారు. వీరు భీమా ఏజెంటుగారు. ఇకనైనా పాలిసీ తీసుకోమని చెప్పబోతున్నారు. వీరు ఫిలిం ప్రొడ్యూసరుగారు. మీరు కొట్టిన పల్టీలు చూసి ముచ్చటపడి

కామిడీ పిక్చర్లో బుక్ చెయ్యాలని ప్రుబలాట పడు తున్నారు ...."

"తమ రెవరో!" అన్నాడు భీమాఏజెంటు కోపంగా.

"నేను దారినపోయే దానయ్యాని. ఈన కిందపడే ముందు సన్నాసరా చేసుకోబోయి నా కండువా పట్టుకున్నారు. దాని రెండో చెంగు ప్రస్తుతం వారికింద వుంది. విడుదల కాగానే పోతాను."

*　　*　　*




ఇద్దరు తాతయ్యలు తమతమ దారుఢ్యాలగురించి చెప్పుకుంటున్నారు.

"వయసు మీదున్నపు డెంతో, వయసు మీద పడ్డాకూడా. అంత దారుఢ్యమూ ఉంది నాకు. అంతెందుకూ? అల్లదిగో ఆ గడియార స్తంభం చిన్నముల్లుమీద వాలిన ఈగ నా కంటికి స్పష్టంగా కనిపిస్తోంది. చూడండి" అన్నాడొక శత వృద్ధుడు.

శతాధిక వృద్ధు చెవులు రిక్కించి విన్నట్లభినయించి, "నిజమే స్మండీ. అదిగో దాని అడుగుల సవ్వడి. జేఘంటలా వినబడుతుంటేనే. నిజమే. మీ దృష్టి చెడలేదు" అన్నాడు.

♦ ♦ ♦

"బాబాయ్. ఇవాళ మా కాలేజీలో నాకు రెండు బహుమతులు వచ్చాయి" అన్నాడు భావిపౌరుడు.

"దేనికోయ్."

"ఒకటి జ్ఞాపకశక్తికి. రెండోదేమో.... అదేమిటీ.... అదేదో... గుర్తుకు రావటల్లేదు బాబాయ్."

♦ ♦ ♦

ఓ తల్లి అర్ధరాత్రివేళ బిడ్డను తీసుకుని డాక్టరింటికి వచ్చింది — వాతం కమ్మింది చూడమని.

"ఏం చేశారు? ఏం చేశారు?" అన్నాడు డాక్టరు.

"మీ రిచ్చినదే. పిల్లడికి నెలకో మాత్రచొప్పున వెయ్యమన్నారుగా; వాడికి తొమ్మిదోనెలగదా అని తొమ్మిది మాత్రల్లు తెప్పించి వేశాను సాయంత్రం."

♦ ♦ ♦

అద్దె వసూలుకోసం ఇంటాయన రాగానే కోనేటి రావు మండిపడ్డాడు. "చూడండి రాత్రి వర్షాని కిల్లంతా

తోసేశారే... చెరువైపోయింది. ఇలా ఎన్నాళ్ళు?" అంటూ దులిపేశాడు.

"బాపుంది. వర్షాలెన్నాళ్ళో చెప్పిందికి నేనేం వెదర్ బ్యూరో పెట్టాననుకున్నారా? సోది చెప్పగలనను కున్నారా! నాకేం తెలుసు!" అన్నాడింటాయన.

*　　*　　*

కెప్టెను ఓడమీంచి తూలిపడిపోయాడు రాత్రివేళ సముద్రంలోకి. ఒక నావికుడు తాడు విసిరి అతన్ని పైకి లాగాడు.

"తెల్లవారగానే పెరేడ్‌లో అందరిముందు నీకు కృతజ్ఞత తెలుపుకుంటాను. చాలా థాంక్సు" అన్నాడు కెప్టెన్.

"అంతపనిమాత్రం వద్దు. ఈసంగతి తెలిస్తే మిగతా వాళ్ళంతా నన్ను సముద్రంలోకి తోసేస్తారు" అన్నాడు నావికుడు.

*　　*　　*

విదేశ యాత్రచేసివచ్చిన దంపతులిద్దరికి విందు ఏర్పాటుచేశారు మిత్రులు. సభకు వెళ్ళేముందు భార్య, భర్తను హెచ్చరించింది.

"చూడండీ, సభలో విదేశాల్ని గురించి మాటాడి నప్పుడు జాగ్రత్త. పెళ్ళికిముందు నాతో మాట్లాడినట్టు కాదు. అందరికీ విదేశాలసంగతి తెలుసు; కోతలు కోయకుండా కొద్దిగా మాట్లాడండి" అంది.

"ఫరవాలేదులే. అంతగా నేను మితిమీరుతున్నా ననిపిస్తే మెల్లిగా నా కాలు తొక్కు, తగ్గిపోతాను" అన్నాడు భర్త.

విందులో ఉపన్యసిస్తూ అతను కొద్దినిముషాలలోనే పెడదారి పట్టాడు: "ఆవూళ్ళో మేము పార్లమెంటు భవనం చూశాం. ఎంతపెద్దదనీ, దాని పొడుగు పదిమైళ్ళు, వెడల్పు అయిదుమైళ్ళు...." ఇక లాభంలేదని అర్ధాంగి అతని పాదం తొక్కింది.

"ఎత్తు ఐదు అంగుళాలు" అన్నాడు భర్త.

* * *

ఆరడుగుల పొడుగు, ఎకరంబాతిక ఛాతీ, గజమున్నర మీసాలూ వున్న భారీ రైతుసోదరుడు బ్లాకు డెవలప్మెంటు ఆఫీసరుగారిని చూడడానికి వానలో తడిసి వచ్చాడు. ఆఫీసరుకు కోపంవచ్చినా ఆ పెద్దమనిషినిచూసి తమాయించుకున్నాడు. 'విలేజిబ్రూట్స్' అని గొణుక్కున్నాడు.

"కనీసం బురదగొట్టిన ఆ జోళ్ళు గుమ్మందగ్గిర విడిచి రాగాదా?" అన్నాడు గదంతా బురదమయం చేసిన వెంకటేశ్వర పాదరక్షలు చూస్తూ.

"జోళ్ళా? కొళ్ళేందయ్యోవ్! నేను జోళ్ళు తొడుక్కోందే" అన్నాడు రైతుసోదరుడు ఆశ్చర్యంతో.

* * *

## కారణాల తోరణం

అమ్మగారు పనికుర్రాణ్ణి మందలించింది.

"వెధవా, అలా చప్పున తలుపులుతోసుకు నా గదిలోకి రాకూడదు. ఒకవేళ బట్టలు కట్టుకుంటున్నాననుకో. అంచేత ముందర పిలవాలి"

"ఎందుకండీ! తలుపుసందులోంచి ముందరే సూస్తానుగా!" అన్నాడు కుర్రాడు.

♦ ♦ ♦




కేసు పునర్విచారణ కోరారు లాయరుగారు.

"ఏం? ఏ మొచ్చింది?...." అన్నాడు జడ్జి.

"మా క్లయింటుకి మళ్ళీ ఓ పెద్ద మనియార్డరొచ్చిం దిట".

* * *

క్లయింటుని అడగవలసినవన్నీ అడిగి విషయం తెలుసుకున్నారు ప్లీడరుగారు.

"చెప్పవలసినవన్నీ చెప్పావుగా. అయితే కేసు పట్టుతున్నాను. చాలా పాయింట్లున్నాయి."

"గెలుస్తామంటారా!" అన్నాడు క్లయింటు.

"నిస్సందేహంగా. నువ్వు నిర్దోషివని రుజువుచేసే భారం నాది గెలుపు ఖాయం. చెప్పవలసిన విషయాలన్నీ చెప్పావుగా దాపరికం లేకుండా?"

"ఆహా. అన్నీ చెప్పానండీ—ఒక్క, ఆ డబ్బు కప్పెట్టిన చోటుతప్ప."

* * *

"ఏవిటయ్యా ఆ రొద ఇంతవరకూ ఆరు కేసులు అయిపోయాయి. ఒక్కదాంట్లో ఒక్కముక్కకూడా వినబళ్లేదు నాకు. ఇలా అయితే ఎలా? నిశ్శబ్దం," అన్నారు ఒక జడ్జిగారు కోపంగా.

*　　　*　　　*

సాక్షిని పరీక్షిస్తున్నాడు లాయరు.

"ఏ వూరు నీది?"

"ఎవరిదీ—నాదేనా—"

"ఆ నీదే"

"దాశేసరం"

"ఏం పనిచేస్తావు?"

"ఎవరూ? నేనా?"

"ఆ నువ్వే"

"తలపని చేస్తా"

"నీ కెన్నేళ్ళు?"

"ఎవరికీ? నాకా?"

"అబ్బే. కాదు నాకు." అన్నాడు లాయరు మండిపడి.

"మీ కంటారా? ఏం, నలభై దాటి యాభయ్యో పడిలో పడుండరూ.... అంతేనా?"

*　　*　　*

"అయితే ముద్దాయి నిన్ను విద్వేషోద్రేకాలతో కొట్టాడన్నమాట."

"కర్రతో గొట్టిండని చెబితే సీగ్గాదయ్యా. ఆ మాయ దారి మాటలు మనకొద్దు."

*　　*

ఖూనీ కేసులో సాక్షిని పరీక్షిస్తున్నాడు లాయరు.

"మీరు ఈ యింట్లో సరిగ్గా ఐదు నిముషాలున్నానన్నారు. మీ దగ్గర వాచిలేదు.... మీ వూహ అంచనా తప్పుకావచ్చు. ఇప్పుడు చూద్దాం. ఇదిగో నేను నా జేబు గడియారాన్ని చూస్తూవుంటాను. సరిగ్గా అయిదునిముషాలు కాగానే చెప్పండి. చూస్తా."

సరిగ్గా అయిదు నిముషాలు కాగానే, "ఐదు నిముషాలయింది" అన్నాడు సాక్షి.

కేసు పోయింది. లాయరు దిగులుపడినా తరవాత కోర్టుబయట సాక్షిని కలుసుకుని యథాలాపంగా అడిగాడుట "మీరు అంత ఖచ్చితంగా ఐదు నిముషాలు కాగానే ఎలా చెప్పగలిగారండీ?" అని.

"దానికేముంది. సరిగ్గా కోర్టు హాల్లో మీ వెనకాతే గోడగడియారం వుందిగదా" అన్నాడు సాక్షి

*　　*　　*

టైపురైటరు దొంగిలించాడన్న నేరాన్ని ముద్దాయి ససేమిరా ఒప్పుకోలేదు. చివరకి ప్లీడరుకు విసుగెత్తి ఆ టైపురైటరు తెప్పించి ముద్దాయి ఎదట పెట్టాడు.

"ఇది నువ్వెత్తుకు రాలేదూ?" అన్నాడు.

"ఆరిమీ ఇదా మీారడిగేది. ఇది టైపు మిషినా నేనా గల్లాపెట్టి అని ఎత్తుకొచ్చా గదండీ,నాకేం తెల్సు?" అన్నాడు దొంగ.

*　　*　　*

చోరశిరోమణి చిన్న భార్య అలిగింది నెక్లేస్ తేలేదని.

"ఏం జెయిమంటావు సెప్పు. ఆ నగలకొట్టుకుమూడు సార్లెల్లాను. యదవనాయ్యాళ్ళు పద్దులు సూత్తనారంట—రేతిరి పన్నెండైనా కొట్టుమియ్యిలేదు మరి" అన్నాడు భర్త.

*　　*　　*

ఉభయపక్షాల వాదాలూ విని మెజస్ట్రీటు వాటిని సమీక్షిస్తూ ఇలా అన్నారు. "రామయ్యకి సూరయ్య వంద రూపాయలు చేబదు లిచ్చానంటాడు. అందుకు పదిమంది సాక్షులున్నారు. ఆ బదులు తీర్చగా చూసినట్టు సూరయ్య తరఫున పదిహేనుమంది సాక్ష్యం చెబుతున్నారు ..."

రామయ్య మండిపడ్డాడు. "అయ్యా మేస్ట్రీటుగారూ! ఆ సూరయ్య చెప్పేది అబద్ధం వాడి సాక్షులు చెప్పేదీ అబద్ధం. అది రుజువుచేసేందుకైనా నేను నిజంచెప్పేస్తా వినండి. నేను జబ్బులో వాడికి నూర్రూపాయలు బదు లివ్వలేదు"

* * *

లాయరు : ముద్దాయి అంటుండగా నువ్వు విన్న మాటలన్నీ కోర్టువారికి చెప్పు.

సాక్షి: శా. బాగోదండీ. అయ్యన్నీ పెద్దమదుసు లినాల్సిన మాటలు కావు.

లాయరు: సరే జడ్జిగారి చెవులో మెల్లిగా చెప్పు.

* * *

ఒక కేసులో పోలీసు యించుమించు ఇంతగానూ న్యాయాధికారిని మసన్నం చేశాడు.

“....ముద్దాయి నోటికొచ్చిన మాటలన్నీ కూస్తు న్నాడండీ. వెంటనే నువ్వు పెద్దమనుషులమధ్య ఉండతగ్గ వాడవు కావని చెప్పి మీ దగ్గిర కీడ్చుకొచ్చానండీ,” అని నివేదించాడు.

* * *




పాల్ మ్యునీ జీవితం సినిమా తీయ నిశ్చయించి ముఖ్యపాత్రకి మిక్కీరూనీని బుక్ చేశాడొక ప్రొడ్యూసరు.

“అదేవిటండీ, పాల్ మ్యూని బతికే వున్నాడు. [illegible] అద్భుతంగా నటిస్తాడు. ఆయనుండగా—”

“అబ్బే అంతా బాగానేవుంది. కాని పాల్ మ్యూని బాగా పొడుగు. ఈ రోలుకి పనికిరాడు”

* * *

## వాచీ బజారు

"ఈ వాచీ కొన్నధర వందరూపాయలండీ. ఆ ధరకే అమ్మేస్తాను. నా కొట్లో గడియారాలన్నీ అంతే"

"మరయితే మీకు లాభం మిగలొద్దూ?"

"అమ్మకంలో ఏం వుండదు. రిపేరు కొస్తుందిగా; అప్పుడు లాభం రాబట్టుకోవాలి."

♦ ♦ ♦

## రోగులు

ధర్మాసుపత్రి హాలులో రోగులు చాలామంది పడిగాపులు పడి వున్నారు. ఒక ముసలాయన చూసి చూసి లేచిపోయాడు.

"ఇంతకన్న ఇంటిదగ్గర సహజమైన చావు చస్తాను. అదే సుళువు" అనుకుంటూ.

♦ ♦ ♦

రైల్లో ఒకాయన వుండుండి బావురుమని ఏడిచాడు.

"మాట బాగా వినబడదని తెలుసుగాని బ్రహ్మ చెముడు పట్టుకుందని ఇపుడు తెలిసిందండి బాబోయ్!" అన్నాడు.



"అదేవిటి? ఇపుడు తెలీకమేమిటి?" అన్నాడు ఎదురుగా వున్నాయన.

"ఘంటనించి మీరు ఒక్కలాగా నాతో ఏదో చెబుతున్నారు. ఒక్కమాటకూడా వినబడలేదు."

"చంపావయ్యా. నేను మాట్లాడడంలేదు. వక్కపొడి నవుల్తున్నాను."

* * *

## దస్తూరి

[చూసి లాభంలేదు]

దస్తూరి మన గుణాల కస్తూరి అన్న ముక్క అక్షరాలా నిజమైతే పెద్దపెద్ద అధికారులు, చెక్కులమీద సంతకాలు పెట్టేవాళ్ళూ వుట్టి గందరగోళపు గలీజు మనుషులనుకోవాలి. డాక్టర్ల బుర్రలు అయోమయంగా వుంటాయనుకోవాలి. దస్తూరికి డాక్టర్ల తరువాతే ఎవరన్నా చెప్పుకోవాలి.

ఒకాయన ఒకసారి విసుక్కున్నాడు. "ఈ డాక్టరు కాస్త తెరిపిగా విషయం తెలిసేలా రాస్తే బాగుణ్ణు" అని.

ఆయన మిత్రుడు ఒప్పుకోలేదు. ఆయన దగ్గర ఒక డాక్టరుగారు రాసిచ్చిన మందుచీటీ వుంది. దాన్ని ఆయన సినిమాహాలులో ఫ్రీపాసుగా చూపించి వాడుకున్నాడు.

రెల్వేపాసుగా కొన్నాళ్ళు వాడాడు. రెండు ఉద్యోగాలకి హెల్తు సర్టిఫికెట్‌గా చూపించాడు.

'డాక్టర్లుసంగతి తెలిసేలా రాస్తే ఇవన్నీ ఎలా సాగుతాయి?' అంటాడాయన.

* * *




"మీరు డెబ్భై ఏళ్ళు ఖచ్చితంగా బతుకుతారండీ."

"ఏడిసినట్టుంది మీ జోస్యం. నాకు ఇప్పుడు డెబ్భై యేళ్ళు."

"చూశారా! నే చెప్పలే?"

* * *




ఖైదులోపడ్డ తోడు దొంగను చూడబోయా డొక జేబుదొంగ.

నీకోసం ఓ ప్లీడర్ని మాట్లాడాను. డబ్బు తెమ్మన్నాడు. నెలమద్ధిన, సరే మొన్న తెచ్చినవాచీ తాకట్టెట్టేశాను. ఆడికాడే" అన్నాడు.

"ఆడికాడే వుంచుకున్నాడా?"

"ఆ, వుంచుకున్నాననే అనుకుంటున్నాడనుకో." అన్నాడు జేబుదొంగ చిరునవ్వునవ్వి.



శీతాకాలం జేబుదొంగలకి మంచి సీజను కాదుట. ప్రతివాడూ చలిమూలాన చేతులు జేబుల్లోనే పెట్టుకు నడుస్తాడు మరి.



జేబుదొంగ చాకచక్యం విని జడ్జిగారు విస్తుపోయారు.

"అవతలివాడికి బొత్తిగా తెలీనంత చులాగ్గా జేబులో పర్సు ఎలా లాగుతావురా?" అన్నారు.

"అయ్యా ఆ ఒడుపులు చెప్పడానికి పాతిక రూపాయలు ఫీజవుద్దండి. ఇట్టవైతే రేపు మాట్నీ ఆటకి రండి," అన్నాడు దొంగ.



## బాలవాక్యం

"దేవుడు మన పాపాలు పోగొట్టి మన్ని క్షమించా లంటే మనం ఏం చెయ్యాలి?"

"ముందస్తుగా పాపం చెయ్యాలండీ."

  

## స్వర్గ



## నరకాలు

షేక్స్పియర్ నాటకాలన్నీ బాకన్ రాశాడని వాదించే ఒకాయన మార్క్ట్వైనును ఆ వాదాలతో చాలాసేపు బాధించాడు.

"అయ్యా, ఇదిలా తేలేదికాదు. నేను స్వర్గానికెళ్లాక షేక్స్పియర్నే కనుక్కుంటాను" అన్నాడు మార్క్ట్వైన్.

"హహహ. షేక్స్పియరు స్వర్గంలో ఎలా వుంటాడండీ?"

"ఓహో, అయితే మీరే కనుక్కోవచ్చు" అన్నాడు మార్క్‌ట్వైను.

♦ ♦ ♦




యాత్రికుల బృందానికి నయాగరా జలపాతాన్ని చూపిస్తున్నాడు మార్గదర్శి. "అయ్యా ఇదేనండి ప్రపంచ ప్రసిద్ధమైన నయాగరా, బ్రహ్మాండమైన జలపాతం.... అమ్మా, మీ ఆడంగులు ఒక్క నిముషం కబుర్లు ఆపితే అంతా ఓసారి జలపాతం హోరు వింటారండీ."

♦ ♦ ♦

పిల్లడు అల్లరిపని చేశాడు. తల్లి కొట్టబోయింది. అంతలో తన తల్లి చెప్పినమాట గుర్తుకొచ్చి "వుండు వెధవా నీ పని చెప్తా" అంటూ వంటింట్లోకి వెళ్ళి పట్టెడు చద్ది అన్నం పెట్టుకొని గబగబ తినసాగింది.

"పరగడుపున పిల్లల్ని కొట్టకు సుమా" అని వాళ్ళ అమ్మ మరీ మరీ చెప్పిందిట లోగడ.

♦ ♦ ♦




అమెరికన్ హాస్యనటుడు, చమత్కారి బాబ్ హోప్ రాజకీయ వాదులను ఒక్క ముక్కలో సమీక్షించాడు. ఒక సభలో ఉపన్యాసం ఆరంభిస్తూ.

"లేడీస్, జెంటిల్‌మెన్ అండ్ పొలిటీషియన్స్—" అని సంబోధించాడు.

♦ ♦ ♦

ఎలక్షన్ ప్రచారంకోసం, పోటీచేస్తున్న వుభయ పక్షాల నాయకులూ ఒకేసారి ఒక వూరు వచ్చారు. ఇద్దరికి ఒక్కపూటే గడువుంది. ఇద్దరికీ ఒకటే ఉపన్యాస స్థలం, మునిసిపల్ మైదానం.

పురపాలక సంఘం ఎన్నికలు రెండు నెలల్లో వున్నందువల్ల అధ్యక్షుడు తాత్కాలికంగా తటస్థంగా ఉండదలచుకున్నాడు -

ముందర ఆయన వేదిక ఎక్కి స్వాగతం చెప్పి పరి

చయం ఆరంభించారు. "ఇప్పుడు మాటాడబోతున్నవారు మనందరికీ సుపరిచితులే. బాల్యంనుండీ మహా త్యాగాలు చేస్తున్నారు. స్నేహపరులు. చిత్తశుద్ధికి ఆయన నిలయం," అని వెనక్కి తిరిగి ఉభయ నాయకులనూ చూసి "మీ ఇద్దరిలో ఎవరు ముందు మాట్లాడతారు? ఒకరు లేచిరండి...." అన్నాడు.

* * *

రైల్లో కూర్చుని, గార్డుని పిలిచి రైలునీ అవకతవకలనీ దుమ్మెత్తి పోశాడొకాయన. తన కసలు ఈ పద్ధతులేవీ నచ్చలేదన్నాడు. మారాలన్నాడు.

"సార్, అవన్నీ నాకు చెప్పి ఏం లాభం. మీ ప్రాంత ఎమ్మెల్యే గారితో చెప్పండి. ఆయనేమన్నా చేస్తాడు" అన్నాడు గార్డు.

'ఏడిసినట్టుంది సలహా! నేనే మావూరి ఎమ్మెల్యేని"

* * *



# డాక్టర్లు

రోగిని పరీక్షించి, మందిస్తూ సిగరెట్లు పూర్తిగా మానివెయ్యాలన్నాడు డాక్టరు. అంతగా మానలేకపోతే భోజనం తరవాత ఒక్కటి కాల్చమన్నాడు. ఆర్నెల్ల తర వాత రోగిని తిరిగి పరీక్షించాడు డాక్టరు.

"చూశారా, గుండులా ఉన్నారు. నా మాట విన బట్టేగదా!" అన్నాడు.

"ఏమ్మాటసార్, చస్తున్నా. రోజుకి పదిహేనుసార్లు భోంచెయ్యలేక" అన్నాడు రోగి.

* * *

"ఏం?" అన్నాడు డాక్టరు.

"చిత్తం నా కాలు—దానికి దెబ్బ తగిలిందండి"

"అలాగా, సర్లే. కొంచెం పన్లో వున్నాగాని ఆనక ఎవరిచేతనైనా పంపు మందిస్తాను," అన్నాడు డాక్టరు పరాగ్గా.

* * *

“డాక్టరుగారూ, నా కుడికాలు చూశారూ చాలా నొప్పిగా వుందండీ” అన్నాడో ముసలాయన.

“పెద్దవయసుకదండీ, అలాంటి బాధలు వస్తూనే వుంటాయి_”

“చిత్తం. మరి నా ఎడమకాలుది కూడా కుడికాలు వయసేగదా దానికి రాలేదెంచేతో?” అన్నాడు పెద్దాయన విలాసంగా నవ్వి.

“దానికేముందండీ, మందిస్తా పుచ్చుగోండి, ఇట్టే వస్తుంది దానికీ.”

* * *

“శర్మగారూ, నిన్న మీరిచ్చిన చెక్కు బాంకు నించి తిరిగొచ్చేసింది తెలుసా?”

“మొన్న మీరు తెగ్గోసిన ఆనికాయలుకూడా అంతే స్మండీ. రంగున మళ్ళీ చక్కా వచ్చాయి నిన్న.”

* * *

డా: మాష్టారూ. నిన్నటికన్న ఈ ఉదయం సాఫీగా, సునాయాసంగా దగ్గుతున్నారు?

రోగి: అదీ ఓ ప్రజ్ఞేనా. రాత్రి తెల్లవార్లూ సాధన చేశాను. ఆ మాత్రంకూడా రాదా?

*　　　*　　　*

డాక్టరుగారి అబ్బాయి డాక్టరీ చదివి ప్రాక్టీసు ఆరంభించాడు. ఒకసారి తండ్రి ఊరికెళ్ళి తిరిగిరాగానే విశేషాలు చెబుతూ "నాన్నా, ఆ శాస్త్రిగారి కడుపునొప్పికేసు లేదూ—నువ్వు ఏడేళ్ళనించి ట్రీట్ చేస్తున్నావు. అది మొన్న ఒక్క ఆపరేషన్‌తో పూర్తిగా నయంచేసి పారేశాను" అన్నాడు ఉత్సాహంగా.

తండ్రి గాఢంగా నిట్టూర్చాడు. "ఎంతపని చేశావు, నిన్ను డాక్టర్ చదివించింది ఆ కేసుతోనే, డిస్పెన్సరీ బిల్డింగుకూడా కట్టించాలని ఆశపెట్టుకున్నా దానిమీద" అన్నాడు.

*　　　*　　　*

"డాక్టరుగారూ, భోజనానికి సరైనవేళ ఏదంటారు?"

"లేనివాడికి దొరికినపుడు, వున్నవాడికి అరిగినపుడూను"

*　　　*　　　*

వైకుంఠయాత్రా స్పెషల్ : (డాక్టరు రోగికి మందిస్తూ) ఇదిగో రెండు మాత్రలిస్తున్నాను, పడుకోబోయేముందు ఒకాటి వేసుకోండి. పొద్దున్న లేస్తే రెండోది వేసుకోండి."

*　　　*　　　*

రోగి చిరాకు పడ్డాడు "మీ-రిచ్చేమందుతో ఈ జరం తగ్గేటు లేదు. బాగా చమటలు పోస్తే జరం దిగిపోతుందిట. చమట పొయ్యే దానికి మందివ్వండి" అన్నాడు.

"అయితే సరే. అలా పక్కగా కూర్చోండి. బిల్లువేసి చూపిస్తాను" అన్నాడు డాక్టరు.




* * *

ఒకరోగి ఆపరేషను బల్ల ఎక్కుతూ :

"మరే ప్రమాదం లేదుగా డాక్టరుగారూ?" అన్నాడు.

"చాలాచల్లేవయ్యా, నవ్విపోతారు నువ్విచ్చే డబ్బుకి ప్రమాదకరమైన ఆపరేష నెవడుచేస్తాడు. బలేవాడివే లే."

* * *

"నర్స్. పొద్దున ఓ నల్లటాయనికి కడుపు ఆపరేషను చేశాంచూడు, ఆయనలో నా చిన్న కత్తెర మర్చిపోయి నట్టున్నాను. చప్పున పట్రా. చాలా ఖరీదది" అన్నాడు డాక్టరు కంగారుగా.

* * *

"మీరు మొన్న మద్రాసెళ్ళి వెయ్యిరూపాయిలిచ్చి ఆపరేషన్ చేయించుకున్నారుటగా" అన్నాడు ఆస్థాన వైద్యుడు నిష్ఠూరంగా.

"చిన్న పొరబాటండీ. వెయ్యికాదు పదిహేను వందలండీ, అది జరిగింది మద్రాసులో కాదు, బొంబాయిలో. పైపెచ్చు నాకు కాదు, ఇంకెవరికో. ఎవరో నాకు తెలీదు."

*　　　*　　　*

ఒక చెట్టు కొమ్మమీద ఇద్దరు పిచ్చిమనుషులు కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

"అదంతా ఓ కథలే. తమాషాగా వుంటుంది. బల్ల మీద పడుకొని డాక్టరుగారూ నాకిదే మొదటి ఆపరేషన్ చాలా భయంగా వుంది అన్నాను. బలేవారే భయమెందుకూ, నాకూ ఇదే తొలిసారి ఆపరేషను చెయ్యడం. నేను భయపడుతున్నానా అన్నాడు డాక్టరు నవ్వి.

జాగ్రత్తగా చేస్తారుగా అన్నాను నీరసంగా. వయం ఇదిగో ఎక్సరే ఎదురుగుండా పెట్టుకు మరీ చేస్తున్నాను అన్నాడు. అయ్యో, అదేమిటండీ? అది నా ఎక్సరే కాదు, రోడ్డు మ్యాపు అన్నాను నేను కంగారుగా.... ఓ, సారీ అంటూ ఆయన కొడుకుని___పదేళ్ళ వెధవని కేకేశారు. ఒరే బాబీ నీ సైన్సు పుస్తకం పట్రా ఓసారి అన్నారు ... ఓగంట తరవాత నాకు తెలివి వచ్చింది. ఆపరేషన్ సక్సెస్

మీ చిన్న పేగులు గ్రాండుగా వున్నాయండీ. అన్నాడు డాక్టర్. కొంపముంచారండీ. కడుపు ఆపరేషన్ చేశారా! రాత. నేను కొండనాలిక కోయించుకుందిక్కదండీ వస్తా. అని గుర్తు చేశాను. సారీ అని నాలిక్కరచుకున్నాడు. ఫరవాలేదు. అదీ చేదాం. పొట్ట ఆపరేషనుకి డబ్బు తీసుకోనులెండి. ఊపిరితిత్తులకిమాత్రం ఇద్దురుగాని అన్నాడు. కాదండోయ్ కొండనాలుక అని చెప్పబోయే లోగానే మళ్ళీ మత్తుమందు ఇచ్చేశాడు... ఓ ఘంట తరవాత తెలివి వచ్చింది. ఇదిగో ఇక్కడున్నాను" కథ ముగిసేసరికి డాక్టరు వచ్చి వాలింది చెట్టుమీద.

"సారీ. పొరబాటైపోయింది....ఇంతకీ మీ కొండ నాలుక చూడనేలేదు నేను.ఓసారి చూపిస్తారా? ఫీజు అక్కర్లేదులెండి. ప్రాక్టీసు లేదుగా" అంది నవ్వుతూ.

* * *

ఒక డిటెక్టివ్ నవలారచయిత ఆపరేషన్ చేయించుకోవలసి వచ్చింది. పేజీకి ఐదుగుర్ని చంపుతారు పొడిచీ, పేల్చీ మీకు భయమేమిటి అన్నారు డాక్టర్లు నవ్వుతూ. రచయిత మాట్లాడలేదు. మత్తుమందు ఇచ్చేముందు కబుర్లు చెబుతూ అద్భుతమైన భయానకమైన అపరాధ పరిశోధన కథ ఆరంభించాడు. కథ మంచి పట్టులోకి వచ్చింది. తరవాత ఏమైందీ? అన్నారు డాక్టర్లూ, నర్సులూ.

"ఆపరేషను కానీండి. మేలుకొన్నాక పూర్తి చేస్తాను" అన్నాడు రచయిత.

(ఆపరేషను జయప్రదమైందా ? రచయిత మేలుకున్నాడా? మిగతా కథ చెప్పాడా? హంతకు లెవ రెవరు? 174 పేజీ చూడండి కావాలంటే.... బహుశా ఈ పుస్తకంలో ఆ పేజీ వుండదు. వున్నా అందులో జవాబు వుండదు. అయినా మీకు సరదాగా వుంటే చూడండి.)

* * *

ఫోను గణగణ మోగేసరికి గాఢ నిద్రలోవున్న డాక్టరు మేలుకుని విసుగ్గా పలికాడు.

"మరేంలేదు డాక్టర్. నిద్రపట్టడంలేదు. మీ బిల్లు ఇప్పట్లో ఇవ్వలేను. అది తలుచుకొన్నకొద్దీ గాభరా, బాధ ఎక్కువై నిద్రపట్టడంలేదు...." అన్నాడు అవతలి మనిషి.

"....ఆ ముక్క ఇప్పుడే చెప్పాలిటయ్యా. ఇహ రాత్రిరి తెల్లవార్లూ నాకు పట్టదు నిద్ర!" అన్నాడు డాక్టరు చిరాగ్గా.

* * *

రోగులకు ఇచ్చే మందులూ, పెట్టించే పథ్యాలూ వాటి ఫలితాలూ ఒక పుస్తకంలో రాసుకుని వాటినిబట్టి

కొత్త రోగులకు వైద్యంచేస్తూ వుండాలని పెద్దడాక్టరుగారు కొడుక్కి బోధపరిచారు. కుర్ర డాక్టరు ఒకసారి ఒక దర్జీ వాడికి విషజ్వరం ముదరడం గమనించి ఇక లాభం లేదు. రెండుమూడు రోజుల్లో పోతావు అని చెప్పేశాడు. నెల్లాళ్ళ తరవాత దర్జీవాడు బజారులో కనిపించాడు. డాక్టరు విస్తుపోయి, ఏం పుచ్చుకున్నావు? ఎలా బతికావు? అన్నాడు. ఏవుందండీ, ఇంకెలాగా బతకనన్నారుగదా అని సుబ్బరంగా కోడి పులావు చేయించుకుతినేశానండి. అదే తగ్గిపోయింది అన్నాడు దర్జీవాడు. ఆ రోజునే ఒక వడ్రంగి వచ్చాడు విషజ్వరంతో. కోడిపులావు తిను అని చెప్పాడు డాక్టరు. మూడోనాటికి వడ్రంగి పరలోకానికి చెక్కేశాడు. కుర్ర డాక్టరు ఆ పూట డైరీలో వ్రాసుకున్నదిది: విషజ్వరం వచ్చినప్పుడు దర్జీలకైతే కోడిపులావు చాలా మంచి. వడ్రంగులకుమాత్రం చాలా ప్రమాదం.

*   *   *

# తుది కోరిక

చావు బతుకులమధ్య అల్లాడుతున్న రోగికి, తోచిన మందులన్నీ ఇచ్చాక, నిట్టూర్చి పెదిమ చప్పరించాడా డాక్టరు. "ఇక లాభం లేదు. ఒక గంటకన్నా ప్రాణాలు నిల

బడదు. చెప్పదలుచుకున్న దేమన్నా ఉంటే ఇప్పుడే చెప్పండి....” అన్నాడు మెల్లిగా.

“ఆ. ఉంది .. ఇంకో డాక్టర్ని పిలిపించండి చప్పున.” అన్నాడు రోగి నీరసంగా.

*　　*　　*

## మా యా బ జా రు

“పదిరూపాయల సరుకు కొంటే నూటికి 10 వంతులు డిస్కౌంటు ఇస్తామండీ. ఇరవైరూపాయలకి నూటికి ఇరవై వంతులు తగ్గిస్తాం....” అన్నాడు దుకాణదారు ఉత్సాహంగా.

“నూటికి నూరుపాళ్ళు డిస్కౌంటు ఇవ్వడానికిఎంత సరుకు కొనాలి ?” అన్నాడు కొనబోయినవాడు.

*　　*　　*

వడ్డీ వ్యాపారస్థుడిదగ్గర కొలువుకి వచ్చాడు ఒక గుమాస్తా.

“నూటికి పన్నెండు రూపాయలమీద అప్పిచ్చాం అనుకోండి ఆరువందలు. ఏడునెలలకెంత అవుతుంది. లెక్క కట్టండి చూదాం” అన్నాడు యజమాని.

“చిత్తం. అప్పు పుచ్చుకొనేవాడు చదువుకున్నాడా? చదువుకోనివాడా? అది చెబితే దాన్నిబట్టి....”

"లెక్క చెయ్యక్కర్లేదు ఇవాళే పనిలోచేరండి." అన్నాడు యజమాని తృప్తిగా.

*    *    *

"నాయనా! నేను వృద్ధికి రావడానికి రెండే ముఖ్య సూత్రాలు పాలించాను. ఒకటి నిజాయితీ, రెండోది వివేకం" అన్నాడు లక్షలార్జించిన వృద్ధ వర్తకుడు కొడుకుతో.

"అంటే ?"

"నువ్వు ఒకరికి ఒక సరుకో డబ్బో ఏదో ఒకటి ఇస్తానూ అంటే, అన్నప్రకారం అన్నవేళకి ప్రళయం వచ్చినాసరే దివాళా ఎత్తినాసరే అది అందచేసి మాట నిలబెట్టుకోవడం నిజాయితీ అన్నమాట."

"రెండోది ?"

"అసలు చచ్చినాసరే మాట ఇవ్వకపోవడం వివేకం."

*    *    *

"ఏవండీ ఈ హేరాయిలు మంచిదేనా? జుట్టు శీఘ్రంగా పెరుగుతుందా?"



"ఏవిటిసార్ అలా అంటారు. మొన్న ఓ సీసా మూత విప్పి కొంచెం రాసుకోబోయాను. ఒలికి

దువ్వెన్న మీద పడింది. ఇంకో గంటలో ఆ దువ్వెన బ్రష్షుగా మారిపోయింది. ఇదే చూడండి."

* * *

"మీరు నమ్ముతారో లేదోగాని, ఎదటివాడి మనసులో ఊహ ఏమిటో ఇట్టే పసిగట్టి చెప్పగలను," అన్నాడొక కోతలరాయుడు కొత్త ఆనపకాయ అందుకుని.

"అలాగా.... అయితే నన్ను క్షమించండి." అన్నాడు విసుగెత్తిన శ్రోత.

* * *

"పో! గాడిద కొడకా" అని తిట్టాడొక మూర్ఖుడిని.

"ఏడా నా కొడుకు! ఛీ" అంది దారే పోతున్న గాడిద.

* * *

## సీ-నీ-మః

(మాయా ఛాయా బజార్)

ఒక మాజీ నటుడు చెక్కుపట్టుకుని బ్యాంకుకు

వెళ్ళాడు. అతను మంచిదశలో ఉండగా ఎరిగిఉన్న బ్యాంకు ఏజెంటు గుర్తుపట్టి పలకరించాడు.

"నేను సినిమాకు వెళ్ళి ఎంతకాలం అయిందో ?" అన్నాడు ఏజెంటు మాటల సందర్భంలో.

"నేనూ అంతేనండి, బ్యాంకుకు వచ్చి ఎంతకాలం అయిందో" అన్నాడు నటుడు.

*　　　*　　　*

ఒక తారామతి, తన తాజా చిత్రం చూస్తోంది. తన మేకప్పు షోకప్పు వాలకం ఆమెకు నచ్చలేదు.

"ఏమండీ డైరెక్టరుగారూ, చూశారా మన ఫోటోగ్రాఫరు నన్ను ఎలా ముసలిదానిలా తీశాడో. పదేళ్ళక్రితం ఈయనే నన్ను తీసినపుడు ఎంత అందంగా తాజాగా తీశాడనీ...." అంది తార.

"అవునమ్మా, ఆ ఫోటోగ్రాఫరు కిప్పుడు పదేళ్ళు వయస్సు మళ్ళిందిగదా మరి," అన్నాడు దర్శకుడు.

*　　　*　　　*

కుశలవుల వేషాలకి కుదిర్చిన ఇద్దరు కుర్రాళ్ళలో ఒక్కడు ఎక్కువ డబ్బు కావాలన్నాడు.

"వద్దని చెప్పండి. రాముడికిఒక్కకొడుకు చాలుమన పిక్చర్‌లో. అంతగా కావాలంటే ఒకడిచేత రెండు వేషాలు వేయించి కుశలవులు కవలపిల్లలయినట్టు చూపెడితే సరి" అన్నాడు నిర్మాత.

*　　*　　*

తారలపై మోజు విచిత్రమైనది.

పాతాళభైరవి చిత్రం విడుదలై బ్రహ్మాండంగా నడుస్తున్న రోజులవి. అప్పటికింకా ఎన్. టి. రామారావుకు నాగేశ్వర్రావు కున్నంత పేరు రాలేదు. నాగేశ్వర్రావు జానపద చిత్రాల హీరోగా బాగా పేరు మోశాడు. చిత్రం చూసిన ఇద్దరు ప్రేక్షకులు ఇవతలకి రాగానే, "ఆ మొసలితో పోరాటం ఉంది చూశా? .... అబ్బ ఎంతసేపు పోట్లాడాడయ్యా ఆ రామారావు ?" అన్నాడు ఒకడు.

"అదంతేలే. రామారావు కొత్త గదా. అంచేత అరగంట పట్టింది. అదే మన నాగేశ్వర్రావైతేనా—చిటికెలో చంపేసి ఉండును" అన్నాడు మిత్రుడు.

*　　*　　*

"ఏవిటి సార్, నా డిమాండు మీకేం తెలుసు?"

'మీరు సినిమా వదిలేసి నాటకాల్లో మాత్రమే

వేస్తాను' అని మాటిస్తే నెలకు నాలుగు వేలిస్తామంది ఒక సమితి," అన్నాడు ఒక నటుడు.

"సినిమా కంపెనీల సమితి అయివుంటుంది," అన్నాడు సాటి నటుడు.

* * *

"మీ పిక్చరు కామిడీయా, ట్రాజిడీయా ?"
"డబ్బొస్తే కామెడీ, రాపోతే ట్రాజిడీ"

* * *

"అదేవిటండీ. నేను చచ్చిపోయే సీనులో నా నటన చూసి అందరూ ఏడ్చారు. నా శత్రువులు కూడా" అన్నాడు కారెక్టరాక్టరు.

"అదే ! ఇది సినిమా అయిపోయింది గదా అని ఏడ్చి వుంటారు."

* * *

మన చిత్రాలలో ట్రాజెడీ ఒక్కటికూడా లేదని ఒక ప్రేక్షకుడి వాదం.

"మనవన్నీ సుఖాంత చలన చిత్రాలే. అన్నిటికీ చివర 'ది ఎండ్' (అయిపోయింది) అనేది ఉంటుందిగదా" అంటాడాయన.




ఉద్యోగం దొరక్క తిరుగుతున్న ఒక ఆసామి గత్యంతరంలేక ఒక సర్కస్ కంపెనీలో చేరాడు. 'పులి కవచంలోదూరి, సింహాల బోనులోకి వెళ్ళినించోవాలి,' అన్నాడు మానేజరు. ఆ ఆసామి ఆ ప్రకారమే వేషం కట్టి లోపలికి వెళ్ళాడు. సింహాన్ని చూడగానే కాళ్ళు వణికాయి.

"భయపడకు. నేనూ నీలాంటివాణ్ణే" అంది సింహం.

* * *

"ఏమిటి సార్. మా మనవడు బుద్ధిగా పనిచేస్తున్నాడా? దారిలో పడ్డట్టేనా?" మేనేజరుగారి మిత్రుడు.

"ఆహా .... ఆ మధ్య మీకు పక్షవాతం వచ్చినప్పుడు పని తోచక మనస్సు బాగుండటానికి పజిల్సు వేశాడు, ప్రయిజొచ్చిందిట. క్రిందటివారం మీరు చనిపోయాక పది రోజులు సెలవు పెట్టి వెళ్ళాడు."

* * *

ఒక బస్తీలో పోలీసు అధికారి దొంగనోట్లు పట్టు కున్నట్టు రాజధానిలో పై అధికారికి వ్రాశాడు. వెంటనే వాటిని పంపవలసిందని ఉత్తర్వు వచ్చింది.

ఒక వారం తరవాత ఇంకో ఉత్తరం వచ్చింది. "మీరు పట్టుకున్న దొంగనోట్లు ఇంతవరకూ ఎందుకు పంపకుండా ఉంచుకున్నట్టు? ఇకనైనా వెంటనే పంపండి" అని.

బస్తీ ఉద్యోగి ఆశ్చర్యపడి జవాబు రాశాడు;

"నేను వారంరోజుల క్రితమే వాటిని మీ పేర మని యార్డరుద్వారా పంపిఉన్నాను. ఇంతవరకూ మీకు అందక పోవడం వింతగా ఉంది. నేనే పోస్టాఫీసుకు ఫిర్యాదు చేస్తు న్నాను."

* * *

"రోజులు బాగులేవు. వెధవది ఏ ఆఫీసుకు వెళ్ళినా ఒక్కటే షరతు; దరఖాస్తుదారుడి వయసు పాతికేళ్ళకు మించరాదు. అనుభవం 40 ఏళ్ళకు తగ్గరాదు.... బహుశా వీళ్ళందరికీ పూర్వజన్మలమీద గురి తగలడిందో ఏమిటో!" అన్నాడు నిరుద్యోగి.

* * *

వోడ్ హౌస్ కథల్లో ఉద్యోగం గురించిన కథొ కటె అద్భుతంగా ఉంటుంది.

ఒక నాటకం హాలు మేనేజరు,తన గుమాస్తా రోజూ వసూళ్ళలో ఐదూ,పదీ చెక్కేస్తున్నట్టు పసిగట్టాడు. ఒక నాడు గుమాస్తాని పిలిచాడు. "చూడండి, మీ జీతం ఎంత ఇప్పుడు?" అన్నాడు. "వందండి" అన్నాడు గుమాస్తా.

"సరే నూటయాభైకి పెంచుతున్నాను... అబ్బే నూటయాభై ఏం ఖర్మ, మూడువందలకి పెంచాను."

గుమాస్తా ఆనందంలో ఉబ్బితబ్బిబై వందనాలు చేశాడు.

"మిమ్మల్ని ఇవాళే డిస్మిసు చేస్తున్నాను,"అన్నాడు మానేజరు.

"ఆ కాడికి ఇంక్రిమెంటు ఎందుకిచ్చావయ్యా"అని అడిగాడు మిత్రుడు తరవాత.

"బ్రహ్మాండమైన మూడొందల డాలర్ల ఉద్యోగం పోయిందే అని వాడు ఏడవాలిగదా."అన్నాడు మానేజరు.

* * *

## నేను
## [మమ అనుకోండి]

కారం కాని కారం ఏమిటన్న ప్రశ్న వచ్చింది.

వెటకారం అన్నా రొకరు. అది చేసేవాడికే తీపి

కాని మింగేవాడికి కారమే. చమత్కారమూ అంతే. నిజంగా కారం కానిది, కాకపోవడమేకాక మధురాతి మధురంగా ఉండేకారం—మమకారం.

*　　　　*　　　　*

శ్రీరామచంద్రుడికి, ఒకనాడు నిద్రకు ఉపక్రమించే వేళ, ఒక గొప్ప సందేహం కలిగింది. వెంటనే లేచి కాలి నడకన వశిష్ఠులవారి విడిదికి వెళ్ళి తలుపు తట్టాడు:

"ఎవరది?" అన్నాడు కుల గురువు.

"నేనే!"

"నేనంటే!"

"అది తెలుసుకుందికే ఈవేళప్పుడు వచ్చాను స్వామీ!" అన్నాడు పురుషోత్తముడు.

*　　　　*　　　　*

"నాతో నేను మాట్లాడుకోడం మహా అలవాటై పోయింది డాక్టరుగారూ. కాస్త మందేమేనా ఇస్తే—"

"దాంటో ఇబ్బందేముందండీ. మందెందుకు?"

"అబ్బే వెధవ సోదండీ. విసుగేస్తోంది వాగలేకా వినలేకా"




*　　　　*　　　　*

అర్ధాంగి కులాసాగా కబుర్లు చెబుతూ భర్తని పరీక్షించడానికి ఒక చిక్కు ప్రశ్న వేసింది.

"ఏవండీ మీరూ, నేనూ,పిల్లలూ పడవలో గోదారి మీద పోతుంటే పడవ మునిగిపోతుందనుకోండి. అప్పుడు మీరు ముందరెవర్ని రక్షిస్తారు? పిల్లల్నా? నన్నా?"

"నన్ను" అన్నాడు భర్త గుంభనగా.

* * *

ఇద్దరు నిరుద్యోగులు కాలక్షేపానికి కబుర్లు చెప్పుకుంటున్నారు. "ఏరా బ్రదర్, ఒకటే ఉద్యోగానికి మనం, మరో పదిమందీ దరఖాస్తులు వేశామనుకో. నిన్ను వరసలో నాంతర పెట్టి ఇమ్మంటారు. ముందర నీది పెడతావా నాది పెడతావా?"

"వర్ణక్రమం ప్రకారం 'నా' తరవాతేగదా 'నీ' వంతు" అన్నాడు మిత్రుడు.

* * *

ముగ్గురు వ్యక్తులు సర్వ సంగ పరిత్యాగంచేసితపస్సు చేశారు. భగవంతుడు ఒక్కసారి లీలగా కనబడి :

"మీలో అహంకార మమకారాలు పూర్తిగా పోయినట్టేనా?" అన్నాడు.

"పోయింది స్వామీ.నీనామస్మరణతో తాదాత్మ్యం

పొందాము. మాలో మా మీ నా నీ అనే భేదాలు ఏవీ లేవు" అన్నారు ముగ్గురూ.

"సరే మంచిది. ప్రస్తుతానికి మీ ముగ్గురిలో ఒకరికే మోక్షం ప్రసాదిస్తాను. ముందెవరికి కావాలి?" అన్నాడు దేవుడు.

"నాకు" అన్నాయి మూడు కంఠాలు ఏకగ్రీవంగా.

* * *




తండ్రీ, పాతికేళ్ళ కులదీపకుడూ కలిసి రైల్లో వెళ్తున్నారు. కొత్తవాళ్ళని ధైర్యంగా పలకరించి చక్కగా మాట్లాడడం ఎలాగో ఇంటిదగ్గర ఉపదేశించాడు తండ్రి. రైలు కదలగానే కొడుకు ఆ ప్రకారం పరిచయం చేసుకోబోయాడు. పక్కనేఉన్న చిన్నపిల్లడి తల నిమురుతూ "వీడు మీ అబ్బాయాండీ?" అన్నాడు అటుపక్క ఉన్నావిడను చూసి.

"అవునండీ" అంది తల్లి.

"బాగుంది. చక్కటి పిల్లాడు. ఊ.... మీకు పెళ్ళి అయిందా?"

చెంప ఛెళ్ళుమంది

తండ్రి ఆవిడకి సర్దిచెప్పాడు. తరవాత కొడుక్కి బుద్ధిచెప్పాడు. "అలా కాదురా నాన్నా. ముందర పెళ్ళయిందా అని కనుక్కున్నాకనే పిల్లలగురించి అడగాలి," అని ఉపదేశించాడు.

రెలుదిగి ఇంటికి వెళ్ళాక చుట్టాలమ్మాయిని చూసి "అమ్మా మీకు వివాహం అయిందా?" అన్నాడు.

"కాలేదండీ" అంది ఆ పిల్ల తెల్లబోయి.

"బాగుంది! అయితే మీకు పిల్లలెందరు?" అన్నాడు.

* * *

పురోహితుడు తన శిష్యుడికి ఎప్పుడేమనాలో జాగ్రత్తగా బోధించాడు.

ఒకనాడు ఒక పెద్దమనిషి ఏడుస్తూవచ్చి,

"అయ్యా నా భార్య మరణించింది, ఉత్తర క్రియలు జరిపించాలి రండి," అన్నాడు.

"అయ్యో, ఎంతకష్టం" అంటూనే ఏదో గుర్తొచ్చి "అన్నట్టు మీ భార్యగారు రెండేళ్ళ క్రితమే పోయిందిగా. అప్పుడోసారి చేశాం ఉత్తర క్రియలు," అన్నాడు శిష్యుడు.

"తరవాత మళ్ళీ పెళ్ళి చేసుకున్నానండి"

"అలాగా! సంతోషం. శీఘ్రమే సుపుత్రప్రాప్తిరస్తు," అన్నాడు శిష్యుడు ఉత్సాహంగా.

*  *  *

ముగ్గురు ఇల్లరికపు టల్లుళ్ళు మావగార్లని గురించి ముచ్చటించుకుంటున్నారు.

"మా మావగారు ఉత్తి పరమానందయ్య శిష్యుడోయ్, పైగా నన్ను జడ్డి మనిషంటాడు. మొన్న పది రూపాయలు చేతికిచ్చి, 'నేనిక్కడే ఉంటాగాని ఓ గుర్రబ్బగ్గీ కొని పట్రా' అన్నాడు. స్టుపిడ్ కాపోతే, మా యింటిసావిట్లో ఎలా పడుతుంది చెప్పు" అన్నాడు ఒక అల్లుడు.

"విూ వాడు మెరుగే. మా మావ మరీ చవట. పొద్దున్న నాకో రూపాయిచ్చి బస్సుమీద బజారుకెళ్ళి అక్కడ షాపులో తనున్నాడో లేడో చూసి రమ్మంటాడు. స్టుపిడ్ కాపోతే పక్కనే ఫోనుందిగదా. ఫోనుచేస్తే బేడతో తెమిలిపోదూ?" అన్నాడింకో జామాత.

"ఫోనంటే గుర్తొచ్చింది మా మావగారు మొన్న మధ్యాన్నం నన్ను నిద్రలేపి ఇది పగలా? రాత్రా అన్నాడు. పగలేనని ఊహించి చెబుతే నమ్మలేదు. ఫోను చేసి కనుక్కొని మళ్ళీ చెబితే సరేనన్నాడు."

*  *  *

మేకు తలని గోడకిపెట్టి మొనమీద సుత్తితో బాదేస్తున్నాడొక శిష్యుడు

"నీ దుంపతెగ. అందుకే మన్ని పరమానందయ్య

శిష్యు లన్నారు. ఆ మేకు తల గోడలో కెల్లా దూరుతుం దని! బుర్ర ఉపయోగించు. ఆ మేకు ఈ గోడకాదు, ఎదురు గోడకన్నమాట" అంటూ సీనియర్ శిష్యుడు మేకును అలాగే పట్టుకుని ఎదురుగోడకు తీసుకు వెళ్ళాడు.

*　　　*　　　*

కొడుకు : అమ్మా, ఎందుకమ్మా అన్నీ వేణ్ణీళ్ళలో ముంచుతున్నావు?

తల్లి: నాన్నగారిది విషజ్వరం నాయనా. అంచేత ఆయనకు వాడిన గ్లాసులు, చెంచాలు, బట్టలూ వేణ్ణీళ్ళలో ముంచాలి. అప్పుడు విషక్రిములు చచ్చిపోతాయి.

కొడుకు : అయితే నాన్ననికూడా ముంచమ్మా చప్పున జెరం పోతుంది.

*　　　*　　　*

"ఏరా, వాణ్ణెందుకురా కొట్టావురటా ?" అన్నారు మేష్టారు.

"వాడు నన్ను తిట్టాడండీ."

"తిడితే నువ్వు తిట్టాలిగాని కొడతావా?"

"వాడికి చెముడండీ. ఎంత అరిచి తిట్టినా వాడికి వినపడదు."

*　　　*　　　*

మేష్టరుగారు సరదాగా కబుర్లు చెబుతూ :

"ఒరేయ్ రాము, నీకు దేవుడు ప్రత్యక్షమైతే ఏం కోరుకుంటావురా?" అన్నాడు.

"చాలా డబ్బు ఇమ్మంటానండీ?"

"ఎబ్బే. దేవుడు నాక్కనిపిస్తే ఏమడుగుతానో తెలుస ? నాకు విద్య కావాలీ అంటాను" అన్నాడు గురువు గారు.

"తెలుసండీ. ఎవరికి ఏది తక్కువైతే అది కోరుకుం టాం గదా!" అన్నాడు రాము.

* * *

పిల్లల కబుర్లు విని అదిరిపడి లేచి వచ్చాడు తండ్రి

"ఏరా. తమ్ముడికి బూతుమాటలు నేర్పుతున్నావా లేని కూర్చుని. తప్పు కాదూ."

"నేర్పటంలేదు నాన్నా, ఈ మాటలు అస్సలు ఎప్పుడూ అనకూడదని, అంటే నాన్న కోప్పడతాడని చెప్తున్నాను."

* * *

ఇద్దరు చిట్టినేస్తాలు మాట్లాడుకుంటున్నారు.

"ఏంరా పాపం మీ పాపాయి అస్తమానం అలా ఏడుస్తుందేం ?"

"ఏవిటో. దానికిపళ్ళు లేవు. నడవలేదు జుట్టూ లేదు.

మాటాడలేదు. నవ్వడం చేతగాదు. అలావుంటే మనవేనా సరే ఏడుస్తాం తెలుసా ?"

*     *     *

ఓ కుర్రాడు కుక్కతోక పట్టుకులాగి ఆడుకుంటు న్నాడు.

"వెధవా. తోకపట్టుకు లాగుతావేంరా? కరుస్తుంది." అన్నాడు తండ్రి.

"పో నాన్నా. తోకెక్కడేనా కరుస్తుందేమిటి ?" అన్నాడు కుర్రాడు.

*     *     *



అద్దం ముందర కూర్చుని కళ్ళు చికిలిస్తున్నాడు కుర్రాడు.

"అదేపట్రా పిచ్చితండ్రీ !" అంది తల్లి ముద్దుగా.

"కాదమ్మా....మరీ నేను నిద రోతున్నపుడు ముద్దొస్తానుగా. ఎంత ముద్దొస్తానో చూద్దామని కల్లు మూసుకుని చూస్తున్నా నమ్మా."

*     *     *

ఏడేళ్ళ బాబి బడికి టెలిఫోను చేశాడు.

"ఏమిటి! బాబికి జ్వరం వచ్చిందా. సెలవు కావాలా... ! మాట్లాడుతున్నదెవరు ?" అంది మేష్టరమ్మ ఫోనులో.

"నేను మా నాన్ననండి."

*     *     *

ఐదారేళ్ళ కుర్రాడొకడు ఏడుస్తూ పోలీసుదగ్గరికి వచ్చాడు. "ఏం బాబూ?" అన్నాడు పోలీసు ముద్దుగా.

"మరండీ పాపం మా అమ్మ తప్పిపోయిందండీ. మరేమో మజ్జానం బజారుకొచ్చింది నాతో. మరేమో తప్పి పోయింది. నేను మజ్జానంనించీ కనబట్టంలేదు."

* * *

ఐదేళ్ళ బాబు సావిట్లోకి పరుగెత్తుకొచ్చాడు.

"నాన్నా. మినపరొట్టె చల్లారిపోతోంది. సావిట్లో సెనివెధవలూ మరేమో - ఎప్పుడు పోతారోనమ్మా. మీ నాన్న చప్పుని వస్తే బాగుండునూ - అంటూంది అమ్మ" అన్నాడు.

* * *




"నల్లుల బాధ విపరీతముగా యున్నది. వాటీజ్ ది గవర్నమెంట్ డూయింగ్? నేనేం చెయ్యాలి. చెప్పండి" అని ఒక పత్రికకు వరసగా ఉత్తరాలు రాయసాగాడు ఒకాయన.

"వాటితో స్నేహంకట్టి మంచి చేసుకోండి. వాటిని ప్రేమించడం నేర్చుకోండి. వాటిలోనూ రక్తం వుంది. అది మనదే" అని సమాధానం వచ్చింది.

* * *

ఒక రజకుడి గాడిద ఊళ్ళోకొచ్చి ఓ గృహస్తు చూస్తూ ఉండగా, గుమ్మంముందు పడి చచ్చిపోయింది. సాయంత్రందాకా చూసి దాని యజమానికి కబురంపించాడాయన.

"ఏమబ్బాయి? పొద్దుటనగా మా గుమ్మంలో చచ్చి పడుంది నీ గాడిద. దాని సంగతి చూశావా?" అన్నాడు.

"చూసేదేటుంది సచ్చిన గాడిదిని. మీ గుమ్మంలో సచ్చింది కాబట్టి మీరే యీడిపించుకోవాల. నాకెందుకు సెప్పడం మద్దిన?" అన్నాడు వాడు తెలివిగా.

"అది సరేలే. ఉత్తరక్రియలు జరిపేముందు దగ్గిర బంధువులకు చెప్పడం ధర్మంగదా. అలాగే నేనే ఈడిపిస్తాలే." అన్నాడు గేస్తు.

* * *



లావుపాటి సుబ్బన్నగారు, సన్నగా రివటలా వున్న నారయ్యని చూసి నవ్వి, "నిన్ను చూస్తే ఈ దేశం కరవు కాటకాల్తో మలమల మాడి పోతోందనుకోరట్రా ఎవరైనా!" అన్నారు.

"చిత్రం తనుర్ని చూడగానే, ఆ కరువు కారణం కూడా కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది," అన్నాడు నారయ్య.

* * *

"నే నిలా కాదు. నాకు తెలీని విషయం వస్తే నోరెత్తి ఎన్నడూ మాట్లాడను."

"అవును, లోకంలో అదే అంటారు. నువ్వు ఎన్నడూ పన్నెత్తి పలగ్గా ఏ వాక్యమూ చూసి ఎరగడట!"

* * *

శాస్త్రజ్ఞుణ్ణి పక్కనబెట్టుకుని వ్యవసాయోద్యోగి ఎరువులమీద ఉపన్యాసం ఇచ్చాడు.

"ఒక ఎకరానికి సరిపోయే ఎరువు ఇదిగో ఈ జేబులో వేసుకోవచ్చు" అన్నాడు.

"మరే, ఆ ఎకరా పంట రెండు జేబులలో ఇమిడి పోతుంది" అన్నాడు రైతు.

* * *

మొక్కపాటి నరసింహశాస్త్రిగారూ, శ్రీశ్రీ రైలు స్టేషనులో యథాలాపంగా కలుసుకున్నారు.

"ఊరికేనా? అన్నారు మొ. న. గారు.

"ఊరికే" అన్నాడు శ్రీశ్రీ.

* * *

"శ్రీశ్రీగారూ, మీ రెప్పుడేనా బట్టతలమీగ పద్యం రాశారా?" అన్నాడు రాళ్ళబండి కుటుంబరావు.

"నే నెప్పుడూ కాగితాలమీదే రాస్తాను" అన్నాడు శ్రీ శ్రీ.

* * *

ఒక పల్లెటూరి ఆసామి సినిమా కంపెనీకొచ్చి డైరెక్టరు గది దగ్గర తారట్లాడి లోపలికి తొంగిచూశాడు.

"ఏం" అన్నాడు డైరెక్టరు.

"ఈడ మడుసుల్ని దీసుకంటూరంటగా ?"

"మరి నువ్వొచ్చావేం ?" అన్నాడు డైరెక్టరు నవ్వి.

"నిన్నుజూసి; నన్నుకూడా దీసుకుంటారని ఆశ పడొచ్చాను," అన్నాడు రైతు.

* * *



మాలోకం

[ఏ లోకం చూసినా సరే]

భర్త పనిమీద ఊరు వెళ్తూ, మాలోకం భార్యకి చెక్కు ఒకటి ఇచ్చి "ఇంకా డబ్బు కావలసొస్తే దీనిమీద

సంతకం పెట్టి బ్యాంకుకి పంపించు," అని చెప్పాడు.

"ఏమని పెట్టాలి?"

"నీ తలకాయ. నాకు ఉత్తరాలు రాసినపుడు కింద నీ పేరు రాయవూ. అలాగే" అన్నాడు భర్త.

ఒక వారం తరవాత ఆవిడ చెక్కు తీసి దానిమీద "మీ ప్రియమైన పాదదాసి లక్ష్మి" అని సంతకం పెట్టి బ్యాంకుకు పంపింది.

*　　*　　*

"నిన్నటి అన్నం ఏమైనా మిగిల్తే ఇవాళ ముష్టి వాడికి వెయ్యాలి," అని పద్ధతి చెప్పి పెట్టింది అత్తగారు.

ముష్టివాడు రాగానే, "నిన్నటి అన్నం తింటావా?" అంది కోడలు.

"వెయ్యండమ్మా" అన్నాడు వాడు.

"నిన్నంటే సిన్న కాదు. ఇవాళే మిగిలింది; అంది కని రేపు రా వేస్తాను," అంది కోడలు.

*　　*　　*

# భావి పౌరులు

మేస్టారు సైన్సు పాఠం చెబుతూ, "ఇదిగో నాణెం చూశారా. ఇపుడిది ఈ ఆసిడ్‌లో పడేస్తాను, కరుగుతుందో కరగదో చెప్పగలరా ?" అన్నారు.

"కరగదండి" అన్నాడు రాము తడుముకోకుండా.

"గుడ్. ఎలా ? ఎంచేత ?"

"కరిగేట్టయితే మీ రసలది అందులో వెయ్యరుగా, అందుకు."

* * *

ఏడాదికి నూటికి రూపాయి-చొప్పున రెండేళ్ళు లక్ష రూపాయలమీద వడ్డీ ఎంత అవుతుందో చెప్పమన్నారు మాష్టరుగారు.

రంగయ్య మాట్లాడలేదు. గునుస్తున్నాడు పైగా.

"ఏరా, చెప్పలేవా?"

"అది కాదండి. నూటికి రూపాయంటే గిట్టదండి. లెక్కకట్టటం టైము దండగ." అన్నాడు రంగయ్య నానుస్తూ.

* * *

"ఒరే రామం, వరసగా అంకెలు చెప్పమ్మా చూదాం?"

"ఒకటి రెండు మూడు నాలుగు ఐదు ఆరు ఏడు ఎంది తొమ్మిది పది జాకీ రాణి రాజు...."

* * *

అన్నదమ్ములిద్దరూ కుక్కమీద కాంపోజిషన్ ఒక్కలాగే రాసుకొచ్చారు.

"ఏరా కృష్ణా మీ తమ్ముడు రాసింది కాపీ కొట్టావా? రెండూ ఒక్కలాగే ఉన్నాయి," అన్నారు మేష్టారు.

"కాదండి ఇద్దరం ఒక్క కుక్కమీదే రాశాము."

* * *

## వకీళ్లు

"డాక్టర్, మంచినీళ్ళకు వెళ్ళి వస్తుండగా మంచం కోడు తగిలి కాలు బెణికింది. ఏంచెయ్యమంటారు?" అడిగారెవరో ఫోనులో.

"[illegible]" అన్నాడు డాక్టరు మండిపడి.

"అలాగేనండి. అర్ధరాత్రి గదా ప్రస్తుతానికి నిద్రపోతాను. రేపొద్దున్న మీ సలహా పాటిస్తా వీలైతే," అన్నాడు అవతలి మనిషి తొణుకూ బెణుకూ లేకుండా.

మర్నాడు డాక్టరుగారు ఒక పెళ్ళికి వెళ్ళారు. అక్కడ లాయరు మిత్రుడు కనిపించాడు. మాటల సందర్భంలో ఈ వైనాలన్నీ చెప్పి, ఇలాటివాడికి బిల్లు పంపాననుకోండి ఫోనుచేసినందుకు. దావావేస్తే డబ్బొస్తుందంటారా!

“నిక్షేపంలా బిల్లు పంపండి. వృత్తిరీత్యా మీరు చెప్పే ప్రతిమాటకీ డబ్బు పుచ్చుకోవలసిందే,” అన్నాడు లాయరు.

మర్నాడు ఉదయం డాక్టరుగారికి ఒకబిల్లు అందింది, నిన్నటి సలహాకి లాయరుగారి ఫీజుబిల్లు అది.

* * *

ఒక ఆసామి కారు ప్రమాదంలో దెబ్బతిన్నాడు. కాలు పోయింది. కర్ర దున్నలు పెట్టారు.

మూణ్ణెల్లయినా అతను ఆ కర్రలు పట్టుకునే నడువ సాగాడు—కట్లు అలానే ఉంచి.

“ఇదేమిటి? ఈపాటికి నయమైపోయుంటుందే. కట్లు విప్పి, ఆ కర్రలుకూడా పారెయ్యొచ్చుగా,” అన్నాడొక మిత్రుడు.

“డాక్టరుగారూ అదే అంటున్నారు. ఇవన్నీ తీసెయ్యొచ్చని. ప్లీడరుగారు ఒప్పుకోటంలేదింకా.”

* * *

కోర్టులో జోస్తి జాస్తిగా ఉన్న ఒక ముద్దాయి, లాయర్లు వాదించే పద్ధతులు చూసిచూసి, ఒకసారి తన తరఫున తనే వాదించబోయాడు.

"నువ్వు బ్యాంకులో దొంగతనానికి వెళుతుండగా చూసినట్టు ఈయన సాక్ష్యం" అన్నాడు ప్రాసిక్యూటరు.

"ఏమయ్యా సాక్షీ నేను బ్యాంకులో కెళుతూండంగా నువ్వు చూశావా?" అన్నాడు దొంగ.

"అవును చూశాను"

"మళ్ళీ తిరిగి ఇవతలికి వస్తుండగా చూశావా?"

"లేదు"

"చూశారాండి. సాక్షి ప్రకారం నేనింకా అక్కడే ఉన్నానన్నమాట. కాని నిజానికి ఇక్కడే ఉన్నానుగదా ఈ కేసు అబద్ధం అన్నమాట" అన్నాడు దోషి.

* * *

"నీ జన్మలో ఎక్కడేనా ఓరూపాయిడబ్బులు గడించిన పాపానపోయావూ?" అని గర్జించాడు లాయరు.

"చిత్తం కిందటేడు మీరు ఎలక్షనుకి నిలబడ్డప్పుడు ఓటివ్వడానికి మీ దగ్గరైదు రూపాయి లుచ్చుకున్నా గదండి."

* * *

"సుబ్బారావుగారి పని బాగున్నట్టుందే. మంచి రోరింగ్ ప్రాక్టీసు చేస్తున్నారుటా!"

"ఆ ఆ రోరింగే ప్రాక్టీసు చేస్తున్నారు," అన్నాడు అదీ రాని ప్లీడర్ల లీడరు.

* * *

"నీ తరఫున వాదించడానికి లాయర్ని పెట్టుకోవా?" అన్నాడు న్యాయమూర్తి విచారణ ఆరంభిస్తూ.

"అక్కర్లే ఎందుకండి. నే నెలాగా నిజం చెప్పేదా మనుకుంటున్నాను లాయరెందుకూ" అన్నాడు ముద్దాయి.

* * * *




మలేరియా రోగిని పరీక్షించాడు డాక్టరు.

"రాత్రి చలిముంచుకొచ్చినపుడు పళ్ళు కటకటలాడ తాయా?"

"ఏమోనండి. రాత్రిళ్ళు పళ్ళుతీసి బీరువాలో పెడుతున్నాను. ఇవాళ రాత్రి తీసి చూస్తాను లెండి" అన్నాడు రోగి.

* * *

దంతవైద్యుడు పరీక్ష ముగించి, పన్ను తియ్యడానికి ఐదు రూపాయిలు ఫీజు అన్నాడు.

"అదేవిటండీ! ఒక్క క్షణంలో ఇట్టే లాగిపారేసే దానికి ఐదు రూపాయలేవిటండీ?" అన్నాడు రోగి.

"దానికేముంది. కావలిస్తే అరగంటసేపు పీకుతాను. ఫీజుమాత్రం తగ్గదు."

* * *

పైకోవమనిషి ఒక్కపన్ను పీకడానికి ఐదు రూపాయలేవిటండీ అని బేరం ఆడబోయాడు.

"సరే టోకున ముప్ఫైరెండు పీకించుకోండి పది రూపాయిలకి మూడుపళ్ళు చొప్పున పీకుతాను," అన్నాడు వైద్యుడు.

* * *

పన్ను పీకించుకోండి కొచ్చి కుర్చీలో కూర్చున్న పున్నయ్యగారు, భయంచొప్పున నోరు బిగించుకున్నాడు. డాక్టరు ఎంత చెప్పినా తెరవలేదు.

కబుర్లు చెపుతూనే, డాక్టరు మెల్లిగా, పక్కనే ఉన్న బెల్లు నొక్కాడు.

ఇంకో నిమిషంలో డాక్టరు అసిస్టెంటు లోపలికివచ్చి "ఎవరో పున్నయ్యగారుట, వారికి లాట్రీలో లక్ష రూపాయలు వచ్చింది ప్రయిజు," అన్నాడు.

"ఆ!" అని నోరు తెరిచారు పున్నయ్యగారు.

డాక్టరు పన్ను తీసేశాడు.

* * *

దంతవైద్యుడు, కొత్త పళ్ళసెట్టు తీసి ఇచ్చాడు బోసినోటివాడికి.

"జాగ్రత్త. ఈ కట్టుడు పళ్ళను మామూలు పళ్ళ కన్న శుభ్రంగా ఉంచుకోవాలి తెలిసిందా?" అన్నాడు.

"కాదండీ మరీ ఆ పళ్ళు ఉత్తినేవచ్చిన బాపతు. ఇవి డబ్బుపోసి కొనుక్కున్నాంగదా. జాగ్రత్త అదే వస్తుంది"

* * *

ఏడేళ్ళ కుర్రాడికి పన్ను పీకినందుకు పదిరూపాయిలు అడిగాడు దంతాంతకుడు.

"ఇదెక్కడి విడ్డూరమండీ ఒక్క పన్ను-అందులోనూ కుర్రవెధవది - పీకడానికి పది రూపాయలా?" అన్నాడు తండ్రి.

"మామూలుగా రెండే కాని, మీ పిల్లవాడు పెట్టిన

కేకవిని, పళ్ళు తీయించుకుందికి వచ్చిన నలుగురు పెద్ద మనుషులు పరారీ అయిపోయారు. చూడలేదూ?" అన్నాడు వైద్యుడు.

* * *




# కాలమానం

(ఫాషన్‌లు చూడకండి)

స్త్రీల కాలమానం దేవతల కాలమానానికి దగ్గరగా ఉంటుంది— ముఖ్యంగా అలంకరణ విషయంలో. సినిమాకి వెళ్ళేముందు — ఒక మామూలు క్షణం ఒక పురుష యుగం. అలాటి పురుష యుగాలు రెండుకోట్లు కలిస్తే ఒక స్త్రీ నిముషం. అలాటి నిముషాలు నూటయాభై అయితే ఒక చీర సింగారింపు. నూరు చీర సింగారింపులు ఒక పౌడరుకోటా. నూరు కోటాల కాలం ఒక తిలక ధారణ. నూరు తిలకాలు కలిస్తే ఒక దర్పణ ప్రతిబింబ పర్యవేక్షణ.

* * *

ఒక ఇల్లాలు చీరకట్టి నగలు పెట్టి పేరంటానికి బయలుదేరింది— తెలిసినవాళ్ళ పిల్లకి బలసారె సందర్భంగా.


ఏవండోయ్ - బజారుకేగా వెళుతూంటా - అరపౌను కాఫీ పొడుం పట్రాండి - పంచదార కూడా అయిపోయింది
ఊఁ


నేతివాడితో ఈమాటు పంపిన నెయ్యి వాసనేస్తోందనీ ఇలాఅవుతే పద్దుమానేస్తా మనీ గట్టిగా చెప్పండి-
ఊఁ


వచ్చేటప్పుడు పౌడరుడబ్బా సబ్బుబిళ్ళా తేండి - అలాగే తిలకం బొట్టెలు కూడా తేసుకురండి
ఊఁ


ఇదిగో - అలాబజారు వేపెడుతూన్నా గానీ ఏదేనా కావాలా?
!
శంకర్

14)

ఈవిడ వీధిలోకివచ్చి రథం యెక్కబోయేసరికి కన బడలేదు. కారు ఉంది. పైగా దారేపోయే జనం ఏదో పల్చని సాదా చీరలు కట్టుకున్నారు. నగల్లేవు.

ఈవిడ చీని చీనాంబరాలనీ, కిరీటాన్నీ, పుట్టెడు నగలనీచూసి వారు, వారినిచూసి ఈవిడ విస్తుపోయారుట.

* * *

అలంకరణ త్వరగా తెమిలేలా చేయాలని పురుషులంతా కూడబలుక్కుని ఫాషన్లు ప్రవేశపెట్టారు. అవి త్వరత్వరగా మార్చసాగారు.

పారిస్‌లో ఒకపిల్ల సరికొత్త ఫాషన్లో కొత్త గౌను గబాగబా తొడుక్కుని వీధిలోకి పరుగున వచ్చింది. లాభం లేదు. ఫాషన్ మారిపోయిందన్నారు.

అప్పట్నించి ఆమె ఓ పెద్ద కత్తిర పట్టుకునేది. ఫాషను మారగానే తొడుక్కున్న గౌనుని అడుగునుంచి ఓ అంగుళం కత్తిరించేసేది.

* * *

శకుంతులమార్కు ఫాషను (అసలు రవికలు లేకపోవడం) వచ్చేలోగా జాకెట్ల చేతులు పెరగసాగాయి. దీనికి కత్తెర్లు పనికిరావుగదా.

ఒకాయన, దూరం ఆలోచించి మణికట్టుదాకా చేతులూ, మోకాళ్ళదాకా అంచులూ ఉన్న శాల్తీలు కుట్టించాడు భార్యకి. ఆవిడ వాటిని పైకంటా మడతపెట్టుకునేది. ఫాషను పెరిగిందన్నపుడల్లా ఒకో మడత విప్పేది.

* * *

సత్యకాలపు బామ్మల లెక్క వేరు.

"బామ్మా బామ్మా ఇవాళ పదింటికల్లా వంటచేసి అన్నం పెట్టాలి. కోర్టు పనుంది" అన్నాడు ఒక లాయరు మనవడు.

"పదెందుకురా నాన్నా రొండింటికల్లా పెట్టేస్తాను," అందావిడ.

* * *

ప్రేమికుల కాలమానం నిలకడలేదు ఒకరికొకరు కనబడకపోతే క్షణ మొక యుగం. కౌగలించుకొని ఉంటే యుగమొక క్షణం. వాళ్ళని టైమడగడం మంచిదికాదు

* * *

"కాలం అమూల్యమైనది," అన్నాడో వక్త సుదీర్ఘోపన్యాసాన్ని కొనసాగిస్తూ.

"ఔనా, నిలువలేదనే కాబోలు అలా ఖాతరు లేకుండా మీరు దాన్ని తగలేస్తున్నారు," అన్నాడో శ్రోత.

* * *

"టైమెంతైందండి" అని అడిగాడు ఒక ప్రయాణీకుడు.

ఇనతలి పెద్దమనిషి రెండు గడియారాలు తీసిచూసి, టైము చెప్పాడు.

"రెండు చూస్తున్నారేమిటి? ఒకటి స్లో ఒకటి ఫాస్టూ, కాబోలు ..."

"అబ్బే ఓ దాని చిన్నముల్లు పోయిందండి. రెండో దానికి నిముషాలముల్లు లేదు అందుకని రెండూ పట్టుకుంటాను. ఎప్పుడూ."

* * *

ఆలుమగ లిద్దరు విడాకులకోసం కోర్టు కెక్కారు. వారికి ముగ్గురు పిల్లలు. పిల్లలు నాకావాలంటే నాకావాలని తగవులాట వచ్చింది. రాజీకి మార్గం ఆలోచించి న్యాయమూర్తి ఒక సూచన చేశారు.

"మీ రిద్దరూ ఇంకో ఏడాది కాపరం చెయ్యరాదూ! ఇంకో బిడ్డ కలిగితే చెరిఇద్దర్ని తీసుకోవచ్చుగదా!"

"కవల పిల్లలు కలిగితేనో?" అంది భార్య.

* * *

పెళ్ళిచేసుకోబోయేముందు కళ్ళు పెద్దవిచేసుకుని సాకల్యంగా నాలుగూ చూసుకోవాలి. పెళ్ళి అయిపోయాక అవి మూసుకు తిరగడం మంచిది. అన్నాడు వానప్రస్థానికెళ్తున్న ఒకాయన.

* * *

"నేనుట్టి బుద్ధిహీనుడిని, నిన్ను పెళ్ళాడాను."

"మరే నేనూ అప్పటి కంగారులో మీ సంగతి కనుక్కోలేకపోయాను."

* * *

# ఏది సత్యం?

(ఇదికాదు ఇదికాదు)

"నేనీ వాక్యం పూర్తిచేసిన క్షణంలో నువ్వు పచ్చి అబద్ధం చెప్పగలిగితే పదిరూపాయలిస్తాను."

"అదేవిటయ్యా ఇరవై ఇస్తానని పదిహేనుకి తగ్గించావు ఇంతలో!"

* * *

"తిరుగులేని సత్యాలు మూడు ఈ పళంగా చెప్పాలి. ఏ ఒక్కటి అసత్యమని నాకు తోచినా తలకొట్టి కోట గుమ్మానికి కడతాను," అన్నారు రాజుగారు వినోద కాలక్షేప సభలో.

"అయ్యా, మీ తల్లి గొడ్రాలు కాదు; మీ భార్య కులట కాదు; మీరు అన్నమాట తప్పరు," అన్నాడు విదూషకుడు.

* * *

సత్యమే చెబుతాననిపించి ప్రమాణం చేయించారు కోర్టువారు.

"అజ్బే, ఇలా ముందరికాళ్ళకి బందాలేసి ఒట్లూ, సత్యాలూ పెట్టించేస్తే ఇంక నేను చెప్పేదేముంటుంది. మీకుమటుకు వెవహారాలెలా నడుస్తాయి. మేన్నిజాలు చెప్పేస్తే మీ రెందుకూ?" అన్నాడు సాక్షి విసుగ్గా.

*　　*　　*

ఒక వ్యాపారస్థుడు కోర్టులో వ్యాజ్యెం లాయరుకు ఒప్పగించి పనిమీద పొరుగూరు వెళ్తూ, తీర్పు రాగానే ఏ సంగతీ టెలిగ్రాం ఇవ్వమని చెప్పాడు.

మూడోనాడు లాయరు టెలిగ్రాం పంపాడు: "ధర్మమే నెగ్గింది," అని.

ఓ గంటలో వ్యాపారస్థుడి దగ్గరనుండి తిరుగు టెలిగ్రాం వచ్చింది.

"అయితే అప్పీలు చేయుండి"

*　　*　　*

## బహు - మతులు

నెక్లీసు పోయిందనీ, వెతికి ఇచ్చినవారికి బహుమతి ఇస్తాననీ ప్రకటించా డొకాయన. మర్నాడు అవి ఎత్తుకు పోయిన దొంగ దొరికాడు. పోలీసులు అతన్ని ఖైదుకు తీసుకుపోతున్నారు.

"ఉండండి, ఆ బహుమతి ఇస్తారేమో అడిగొస్తాను," అన్నాడు దొంగ.

*　　*　　*



# హెన్పెక్

"మా యింటో మా ఆవిడదే పై చెయ్యి. అంచేత ఆవిడమాటే చెల్లుతుంది," అన్నాడు ఒకాయన.

"నేనలా ఊరుకోలేనోయ్. ఏవో చిన్నవిషయాలు దానికి వదిలేసి పెద్దవిషయాలన్నీ నేనే చూసుకుంటాను. వాటిపై తుదినిర్ణయం నాదే."

"అంటే? ఏవిటా చిన్నా పెద్దా."

అంటే, కూరేం వండాలి? సినిమాకెప్పుడెళ్ళాలి? దేనికెళ్ళాలి? చీరలెన్ని కొనాలి? ఎక్కడ కొనాలి? నగ లెక్కడ చేయించాలి? పిల్లాడిని ఏ బళ్ళో వెయ్యాలి? నాకు చొక్కాలెన్నుండాలి? రోజు ఖర్చు అణా వుండాలా అర్ధణా చాలా?–ఇలాంటి మైనర్ విషయాలు ఆవిడ హయాము. పోతే పంచవర్ష ప్రణాళిక, కామన్వెల్తులో మన సభ్యత్వం సిరా

యుద్ధీకరణ, కాంగో సమస్య, భాషారాష్ట్రాలువగైరా పెద్ద విషయాలు నావి.

*　　　*　　　*

# మర్యాద రామన్న

రైల్లో ఇద్దరు హోరున (ఆ. ఆడవాళ్ళే) వాదించుకుంటున్నారు. ఒకావిడ కిటికీ తలుపు మూసెయ్యమంటుంది. "ఈ వెధవగాలి నాకు పడదు. జలుబుచేసి చస్తాను." అంది. "వల్లకాదు. ఇదికనక మూసేస్తే ఊపిరాడక నేను చస్తాను." అంది రెండో ఆవిడ.

కర్తవ్యం తోచక ప్రయాణీకులు తికమక పడుతున్నారు.

"ముందర కాసేపు తలుపు మూసేదాం. ఒకావిడ చస్తుంది. ఆ తరువాత తీసేదాం. రెండో ఆవిడ చస్తుంది. తరవాత మనం హాయిగా బతుకుదాం," అన్నాడు మర్యాద రామన్న.

*　　　*　　　*




ఊపిరి సలపనంత పనితో సతమతమవుతున్న ఒక అధికారి చిరాగ్గా గుమాస్తాను పిలిచి, "ఏమయ్యా ఆ పెన్సిలు ముక్క ఎక్కడ పడేశానో చూడు చూడు, వెతుకు వెతుకు" అన్నాడు.

"మీ చెవిలోనే ఉందండి."

"ఏ చెవో చూస్చెప్పలేవుటయ్యా."

* * *

మహాసోమరిని ఎన్నికచేసి ఆస్థానసోమరిపోతును నియమించాలని రాజుగారు సభచేశారు.

"సోమరులంతా చేతులెత్తండి," అన్నారు.

ఒక్కడు తప్ప అంతా చేతులెత్తారు.

"నువ్వు సోమరి కావా?" అన్నాడు రాజుగారు.

"ఊఁ" అన్నాడు సోమరి.

"మరి చెయ్యెత్తవేం."

"అబ్బ. కాసేపుందురూ చూదాం"

* * *

ఇనస్పెక్టరు పిల్లల్ని పరీక్షిస్తూ, "అబ్బాయ్, భారతం రాసిందెవరూ?" అన్నారు ఓ కుర్రవాణ్ణి చూసి.

"నేను కాదండి." అన్నాడు వాడు ఉలిక్కిపడి లేచి.

"నువ్వు....నువ్వు....నువ్వు...." అంటూ వరుసగా మరి ముగ్గుర్ని అడిగారాయన ధాటీగా.

వాళ్ళంతా భయపడి, నేను కాదంటే నేను కాదు అన్నారు.

ఇన్స్పెక్టరుగారు పంతులుగారికేసి చూశారు. మాట వస్తుందని భయపడుతున్న మాష్టరుగారు మరింత కంగారుగా, "ఆ మొదటి వెధవే రాసుంటాడండి. నేను తర్వాత కనుక్కుంటాలెండి," అన్నారు.

* * *



"'నేడే చూడండి', అని ప్రతి సినిమా ప్రకటన లోనూ వేస్తారుగదా అంత కొంపమునిగిపోయే అర్జెంటేమిటీ అంటా?" అన్నాడొకాయన విసుగ్గా.

"రేపుండదని హెచ్చరిక," అన్నాడు నాడే సినిమా చూసివచ్చిన ప్రేక్షకుడు.

* * * *

నేటి పనిపత్తిడిని తగ్గించే సులభసాధనం—రేపు.

*　　*　　*




'దెయ్యాలు లేవు' అని ఒక బేతాళుడితో వాదించి, ధైర్యంగా అమావాస్యనాడు అర్ధరాత్రివేళ వల్లకాటికి ఒక్కడూ వెళ్ళాడు ఒక అంజనేయులు ఈలవేస్తూ.

తిరిగి వస్తూవుండగా, బేతాళుడు చెట్టువెనక నక్కి "హోహోహోహో" అన్నాడు.

ఆంజనేయులు ఈలపాట, గుండెమోత, తరవాత శ్వాస్త్రి ఆగిపోయాయి.

"నాకు తెలుసు భేతాళంగారూ. మీారు ఏ చెట్టు వెనకో నక్కి నన్ను ఝడిపించాలని చూస్తున్నారు.... సర్లెండి అలాగే ఝడుసుకుంటాను." అంటూ ఒక్కసారిగా పరుగు లంకించుకున్నాడు ఆంజనేయులు.

*　　*　　*




దారేపోయే ధానయ్యను ఒకతోపుతోసి ఆగింది కారు.

"ఏవయ్యా కళ్ళులేవూ! చూసి నడపలేవూ కారు?" అన్నాడు దానయ్య.

"బుద్ధిలేదూ చూసుకు నడవలేవూ?" అన్నాడు కారుమీది మనిషి

"నడపడం చేతకాదనా దామా?"

"చేతగాకనేం. నేను ఎనిమిదేళ్ళనించి కారు నడుపుతున్నాను—నీకే నడవడం రాదు."

"నేను నలభై ఏళ్ళనించీ నడుస్తున్నాను"

*　*　*




"అప్పడాల కర్రో కటి కొనాలమ్మా వదినా!"

"ఇప్పుడెందుకండీ"

"ఆ బ్బె, మా కోడలుకోసం"

"మరీ విడ్డూరంగా ఉందండీ మీ వరస. చీపురుకట్ట తిరగేస్తేసరి మా కోడళ్ళందరికీ కొబ్బరిచీపురే వాడాను."

*　*　*




# నిత్యదుఃఖితులు నిరాశావాదులు

కొద్దికాలంలోనే లక్షలకు అధిపతి అయిపోయిన ఒక కామయ్య ఇంకా ఏడుపు మొహం ఫిరాయించకపోవడం గమనించి ఒక మిత్రుడు అడిగాడు సంగతేమిటని.

"ఏం చెప్పమన్నావు నా కష్టం. తల్చుకొన్నకొద్దీ గుండె చెరువైపోతుంది. చెరువులోదూకి చావాలనిపిస్తోంది," అన్నాడు కామయ్య.

"ఏం"

"ఈ నెల తొలివారంలో మా తాత పోయాడు; లక్ష రూపాయల ఆస్తి కలిసింది నాకు."

"మరింకేం?"

"రెండో వారంలో మావయ్య పోయాడు. రెండు లక్షలు కలిసింది."

"హారిమీ, ఇంకా ఏడుపెందుకు?"

"ఎందుకేమిటి? అప్పుడే మూడో వారం వెళ్ళిపోవస్తోంది. ఇంతవరకూ దమ్మిడీ కలిసొచ్చే సూచన లేదు."

*    *    *



## నాటకరంగం

ప్రపంచమే ఒక నాటకరంగం అయితే? మనమంతా కాస్త రిహార్సలు చేసుకు మరీ మాటాడడం మంచిదన్నాడు ఒక నటుడు.

* * *



## మాయదారి మనుషులు

పెళ్ళి ఫెళ్ళుమంటూ జరుగుతోంది. ఒక పెద్దమనిషి గబగబా వచ్చి, సదస్యుల్లో ఒక పెద్దమనిషిని పక్కకి పిలచి "అయ్యా నా పర్సు పోయింది. అర్జెంటుగా ఒక్క వంద రూపాయ లివ్వండి. సాయంత్రం టెలిగ్రాం మనియార్డరు ద్వారా పంపేస్తా," అన్నాడు కంగారుగా.

"ఎవరు మీరు? .... నాకసలు తెలీదే,"

"మాది మెడ్రాసండి"

"ఏం చేస్తున్నారు"

"మాంగనీసు వ్యాపారం.... సుబ్బయ్య అండ్ సన్ అని మా కంపెనీ లెండి."

"అలాగా, ఏ వీధి!"

ఆ అసామి చెప్పాడు.

"ఇంతకీ మీ రెవరు సుబ్బయ్యగారా! అండ్ సన్ గారా!"

"చిత్తం నేను కుమారుడినండి .... నాన్నగారు రాలేదు."

"రాకేం వచ్చారు నేనే సుబ్బయ్యగారిని.... ఇంతకీ నీ పేరేవిటో చెప్పావు కాదురా బాబూ!"

* * *



ప్రయాణాలు - వాహనయోగం

కార్లు, బస్సులూ, బళ్ళు, విమానాలూ.

బస్సులో సీట్లు నిండిపోయాయి. ఒక సబల ఎక్కి నిలబడింది. ఒకాయన లేవబోయాడు.

"అక్కర్లే కూర్చోండి. మరేం పరవాలేదు. నేను నిల బడగలను" అని బలవంతాన కూర్చోపెట్టింది సబల.

తరవాత స్టాపింగులో మరికొందరు జనం ఎక్కారు. ఆయన మళ్ళీ లేవబోయాడు.

"అక్కర్లే ఫరవాలేదు, మేం అబలలం కాదు" అని ఆయన్ని మళ్ళీ కుదేసింది అబల.

నాలుగైదుసార్లు అలా జరిగింది.

అర్భకంగాఉన్న ఆ పెద్దమనిషి నీరసంగా కూర్చుని చేయెత్తి నమస్కరించి, "అమ్మా, నేను దిగేచోటు దాటి రెండుమైళ్ళు వచ్చేశాం. ఇక్కడైనా దయచేసి నన్ను దిగ నిస్తే పెందరాళే ఇల్లు చేరుకుంటాను.... ఈసారి నేను లేస్తే కూర్చోమని తోసెయ్యకండి...." అన్నాడు.

* * *

బస్సెక్కుతూనే చోటు కనపడక కూర్చున్న మొగా ళ్ళందరకేసి కోపంగా చూసింది సరోజ— ఇంకా లేవ రేమిటి ఒక్కళ్ళూ అన్నట్టు. ఎవరూ కదల్లేదు.

ఒక్క ఆసామిమాత్రం ఆమెని రమ్మని సైగ చేశాడు. బస్సుని, అతన్ని ఉద్ధరిస్తున్నట్టు రెండడుగులు వేసింది ఆ పిల్ల.

"చూడమ్మా, ఇంకో రెండు స్టాపింగుల తరవాత నేను దిగిపోతాను. రెడీగా ఉండు. నేను లేచీ లేవగానే గబు క్కుని కూచో. ఏం?" అన్నా డాయన.

* * *

ఒక బండివాడు తన బండిచక్రాలకి పేర్లు పెట్టాడు. మొగచక్రం, ఆడచక్రం అని.

సంసారం అనే బండికి ఆలు మగలు రెండు చక్రాల వంటివారని హరిదాసుగారు చెప్పారట.

"కుడివేపు చక్రం ఎప్పుడూ గొడవ చేస్తుందండి. ఇరుసుకెంత కందెనేసినా యెదవ గొడవ మానదు. అందు కని అది ఆడసెక్రం. మొగోడు యదవ వాగుడు లేకండా జాయిగా పోతాడు గాబట్టి ఎడంవేపుని మొగచక్రం," అని వ్యాఖ్యానించాడతను.

* * *

రాత్రిపూట లారీ జోరుగా వస్తూవుంటే మోటారు సైకిలుమీద పోతున్న ఒక వీరుడు సూటిగా వెళ్ళి లారీకి ఢీ కొట్టాడు.

"ఆ రెండు లైట్లూ చూసి రెండు మోటారు సైకిళ్ళను కొని, రెంటికీ మధ్యగా దూసుకుపోదామని ట్రై చేశాను" అన్నాడతను వాఙ్మూలం ఇస్తూ.

* * *

ఒక నేలయ్యగారు తొలిసారి విమానం ఎక్కారు ఢిల్లీకి. ఇంజను హోరెత్తగానే కిటికీలోంచి చూసి కెవ్వు మన్నాడు.

"అయ్యబాబోయ్. అప్పుడేఎంతెత్తుకెగిరిపోయామో చూడండి చూడండి. కిందని ఆ జనం చీమల బారులా ఎలా కనిపిస్తున్నారో!" అన్నాడు.

"అయ్యా, విమానం ఇంకా పైకి లేవలేదు. మీరు చూసేది జనంకాదు. నిజంగానే చీమలబారు" అన్నాడు పక్కాయన.

*   *   *

ఒక యిల్లాలు బంధువులతో కబుర్లు చెబుతూ "మా ఆయన దేవుడంటివారు. నోట్లో నాలిక లేదు," అంది.

"ఉందో లేదో ఎవడు చూడొచ్చాడు. నువసలాయన్ని నోరు తెరవనిస్తేగా!" అంది ఆవిడ చెల్లెలు.

*   *   *

"బావగారు తెగ ఆవలిస్తున్నారు. నిదరొస్తున్నట్టుంది," అంది మరదలు ఉపన్యాసవాహినిని ఒక్క క్షణం ఆపి తనూ ఆవలిస్తూ.

"ఆవలింత కాదమ్మా, మంచినీళ్ళు కావాలనిఅడుగుదామని చూస్తున్నాను...." అన్నా డాయన.

*   *   *



కుంభకర్ణుడు రైలుకొచ్చాడు. ఫస్టుక్లాసులో ఎక్కి పడకేస్తూ యలమంచిలి రాగానే యలాగైనా తన్ని తన్ని కొట్టి మోసి అయినా దింపెయ్యాలనీ, కలతనిద్రలో ఏం చెప్పినా పట్టించుకోవద్దని టిక్కెట్టుకలెక్టరినీ, గార్డుని బతిమాలుకొన్నాడు.

ఆయన నిద్ర లేచేసరికి విశాఖపట్నం అయింది. గార్డుని పిల్చి తిట్టిపోశాడు, యలమంచిలిలో లేపనందుకు.

గార్డు మందహాసం చేశాడు. “మీరెన్ని తిట్టినా తిట్టండి. అలవాటయిపోయింది. ఇందాక యలమంచిలిలో పై పక్కబర్తుమీదాయన్ని లేపి బలవంతాన దింపేసరికి ఆయన నానా తిట్లూ తిట్టిపోశాడు. రైలు కదిలేదాకా ఆయన్ని కూలీలకప్పగించి పట్టుకోమన్నాను. ఆయనతిట్లలో మీదెన్నోవంతు. కానివ్వండి” అన్నాడు శాంతంగా.

“యలమంచిలివాణ్ణి నేనోయ్ భగవాన్లూ! ఆయన బరంపురం వెళ్ళాలి” అంటూ కేకవేసి కూలిపోయాడు కుంభకర్ణుడు

* * *

రైలు పట్టాలు రెండూ రెండిటికీ గుర్తులని ఒకా యన వ్యాఖ్యానించాడు: ఒకటి రైలు నడవవలసిన వేళ; రెండోది రైలు నడిచేవేళ! ఈ రెండూ ఎన్నడూ కలవ్వు.

*　　　*　　　*

టిక్కెట్టుకలెక్టరు పెట్టెలోకి ఎక్కుతూనే, ఒకశాల్తీ బల్లకిందకి దూరడం చూసి వెంటనే ఇవతలి కీడ్చాడు. వాడు ముసలివాడు "బాబూ, బీదవాణ్ణి. నయాపైసా కూడాలేదు. నా కూతురుపెళ్ళికని మా వూరెళ్తున్నాను. దయదల్చండి" అన్నాడు దీనంగా. టి. టి. సి. జాలిపడి వదిలేశాడు. పక్కబల్లకింద శయనించిన ఇంకొకడిని ఇవతలి కీడ్చాడు. వాడు పడుచుకుర్రాడే. "ఏరా నువ్వెక్కడికి? నువ్వూ నీ కూతురు పెళ్ళికేనా?" అని గద్దమాయించాడు.

"బాబూ, నేనా ముసలాయన కాబోయే అల్లు ణ్ణండి. పెళ్ళి నాదే" అన్నాడా యువకుడు దండంపెట్టి.

*　　　*　　　*

సినిమా కంపెనీ యజమాని ఒకాయన ఊళ్ళో కళా శాల కమిటీ విరాళం అడిగితే, నోటితో లేదనేబదులు చేత్తో లేదందామని "ఐదు లక్షల డాలర్లు తీసుకోండి" అన్నాడు.

మర్నాడు స్థానిక పత్రికలో ఆ వార్త పడింది. కాని అందులో పొరబాటున ఒక సున్నా ఎక్కువ తగిలి యాభై లక్షలు విరాళం ఇచ్చినట్టు పడింది.

ఆ కోటీశ్వరుడు అది చూసి సంపాదకుడికి టెలిఫోను చేశాడు. "మళ్ళీ మీ పత్రిక తప్పురాసిందని చెడ్డపేరొస్తుందేమో. కాలేజికి యాభై లక్షలూ ఈసారి కిస్తాగాని ఇంకెప్పుడూ ఇలాటి అచ్చుతప్పులు వెయ్యబోకండి," అన్నాడు.

*　　　*　　　*

అమెరికాలో ఒక పెట్రోలు కంపెనీ యజమాని బ్యాంకుకు చెక్కు రాసి పంపాడు.

"అంతడబ్బు లేదు," అని వ్రాసి చెక్కును తిరిగి పంపింది బ్యాంకు.

ఇంధనస్వామి మండిపడేలోపల, "డబ్బు లేనిది మీ కాతాలో కాదు: మా దగ్గర" అని విన్నవించుకున్నాడు బ్యాంకుమనిషి వచ్చి.

*　　　*　　　*

టెక్సస్‌లకి రాష్ట్రభక్తి అపరిమితం. అంతకన్నా గొప్ప రాష్ట్రం లేదని చాటడానికి వాళ్ళు నిర్మించే వాక్యాలు బ్రహ్మాండంగా ఉంటాయి.

ఒకసారి ఒక టెక్సన్ నయాగరా జలపాతం దగ్గరకు వెళ్ళాడు. "ఇంతగొప్పది మీ రాష్ట్రంలో లేదని మీరు ఒప్పుకోక తప్పదు," అన్నాడు మిత్రుడు.

"లేదుగాని, ఈ చిల్లుకు మాటుపెట్టే పనివాళ్ళు బోలెడుమందున్నారు," అన్నాడు టెక్సన్ వీరుడు.

* * *




"డాక్టరుగారూ, నేను నిండు నూరేళ్ళూ బతుకుతానంటారా?"

"మీ కిపు డెంతేమిటి వయస్సు?"

"నలభై"

"ముప్పైలా కనిపిస్తున్నారు స్మండీ. మీకు కాఫీ, సిగరెట్లు వగైరా వ్యసనాలు...."

"ఒక్కటికూడా లేదండి. కాఫీయేగాదు, సోడాకూడా తాగను. సిగరెట్లెరగను, సినిమాలూ, నాటకాలూ పడవు

"తెలీకడుగుతా. ఇవేవీ లేకపోతే మీకు నూరేళ్ళు బతకాలని ఆశెందుకండీ? ఏం చేదామనీ?" అన్నాడు డాక్టరుగారు.

* * *

"తాతగారూ, తమరికెంత వయసో తెలుసుకో వచ్చా" అన్నాడు యువకుడు నమస్కరించి.

"మహారాజులా—తొంభై."

"ఆహా మీ తరం తరహా వేరు, ఆ దారుఢ్యం వేరు. తమరి నూరో జన్మదినోత్సవం కూడా కళ్ళారా చూసి ఆనందించాలని ఉంది."

"ఏం బాబూ ఎందుకు చూడరాదు? చిన్నవాడివి. వంట్లో ఏమన్నా సుస్తీగా ఉందా? అలా డీలాపడితే ఎలా?.... తప్పకుండా చూస్తావు. ధైర్యంగా ఉండు," అన్నాడు తాతగారు.

* * *

ఒక సినీ పత్రికా రచయిత కట్టిన లెక్కల ప్రకారం అఖిలభారత సినీతారల సగటు వయసు ముప్ఫైనాలుగు సంవత్సరాలు; కాని విడిగా ఏ తార వయసూ ఇరవైనాలుగు దాటలేదు.

* * *

రెండు ఝాముల పొద్దెక్కేసరికి కట్టెల కొండయ్యకి ప్రాణం చాలొచ్చింది. పెద్ద మోపెడు కట్టెలు కొట్టాడు.

"ఓ యమధర్మరాజా, ఈ యాతన పడలేనయ్యా! ఆ యమదూతల్ని పంపరాదయ్యా?!" అంటూ మోపు కట్ట సాగాడు. కట్టి తలపైకెత్తేసరికి ఎదురుగా భీకరాకారులిద్దరు నిలబడి ఉన్నారు.

"మమ్మల్ని పంపమన్నావుటగా ధర్మరాజుగారితో," అన్నారు.

కొండయ్య గుండె గుభేలుమంది. ఒక్కక్షణం ఆలోచించాడు.

"మరే, ఈ మోపుకాస్త తలకెత్తాలి. సాయం పట్టండి." అన్నాడు గంభీరంగా.

* * *



వికలాంగ సకలం

తామ్సేను చక్రవర్తి సంగీతం అంటే ప్రాణం పెడతాడు. ఒకనాడు ఒక అంధగాయని గానసుధ చేసి అతిశయ పరవశుణ్ణి చేసింది తైమూరు ఆమె పేరు అడిగాడు. ఆమె పేరు లక్ష్మి.

"చిత్రంగా ఉందే! లక్ష్మి గుడ్డిదన్నమాట" అన్నాడు చక్రవర్తి వెటకారంగా.

"అవును గుడ్డిది కనకనే కుంటివాడిని వరించింది" అంది లక్ష్మి.

(తామర్లేను కుంటివాడు)

* * *

ఇద్దరు పాత మిత్రులు కలుసుకున్నారు బజారులో.

"కులాసా?" అన్నట్టు కళ్ళెగరేశా డొకాయన.

"ఆ... కుక్కు-లాసే. చిచ్చిదిగో యి ననననవత్తి కుక్కు-దురుస్తానని డాడాడాడాక్టర్రావుగారంటే వెవెవెవ్వెళ్తున్నాను"

"ఓ ఆయనా. మ్మంచివాడు. నననననానాకుకుకు కుదిర్చిందాయినే" అన్నాడు మిత్రుడు.

* * *

ఒంటికంటివా డొకడు, జోడుకళ్ళవాణ్ణిచూసి "నీకన్న నేనే ఎక్కువ చూడగలను," అన్నాడు.

"అదెవిటి, నీకు మతికూడా పోతుందా?"

"కాదు. నీకు నా ముఖంలో ఒక కన్నే కనిపిస్తుంట కాని, నేను నీ ముఖంలో రెండు కళ్ళు చూడగలనుగదా" అన్నాడు ఏకాక్షి.

* * *

ఇద్దరు చెవిటివాళ్ళు ఎదురయ్యారు.

"ఎక్కడికండోయ్ షికారుకా?"

"అబ్బే కాదండీ ఊరికే షికారుకి."

"ఓహో! షికారుకనుకున్నా లెండి."

* * *

నత్తి నరసయ్య ధుమధుములాడుతూ వచ్చాడు రామ మందిరం దగ్గరికి. అక్కడ ఒక్కడే పెద్దమనిషి ఉన్నాడు.

చ్వేధవలు.... చు చూశారా. దెదేవుడిచ్చిన్దానికేం చేస్తాం. నను చ్వెక్కిరిస్తాడు అడ్డమైన వెధవాను. ఈమాటు డొడొక్క చ్చింపేస్తాను అంటూ ఆరంభించి పదినిముషాల సేపు ఆ ఊళ్ళో వెక్కిరింత వెధవల్నందరినీ తిట్టిపోశాడు.

ఎదటమనిషి మారుమాటాడకుండా అంతా శ్రద్ధగా విన్నాడు. సానుభూతితో తలాడించాడు. నరసయ్య లేచి వెళ్ళిపోయాక దేవుడికో దండం పెట్టుకున్నాడు మనసులోనే

"యియ్యింకానయం, నే నెన్నను నానాగోడుకూడా చెప్పుకున్నానుగాదు. దదదవడవ్వాచి పోయేది," అను కున్నాడు మెల్లిగా.

* * *



# వీలునామాలు

"ప్లీడరుగారూ, మీరు వీలునామాలు రాసిపెట్టడంలో సిద్ధహస్తులని విన్నాను."

"అవునండి."

"రోజుకి హీనపక్షం రెండు మూడేనా రాస్తారటగా."

"మరేండి"

"మరేంలేదు. వీలు రాసినప్పుడు పేర్ల కేమన్నా ఇబ్బందొస్తే — ఒచ్చినా రాపోయినాసరే — వీలు చూసుకుని ఏదో ఒక దాంటో నా పేరిరికిద్దురూ. మీకు పుణ్యంవుంటుంది. పిల్లలవాణ్ణి"

* * *

జమీందారుగారికి మనుషులకన్న కుక్కలమీద మక్కువ ఎక్కువనీ, వాటిలో ఆయన ముద్దుగా 'సివంగి' అని పిలుచుకొనే వేటకుక్క అంటే మరీ ప్రేమ అనీ పసిగట్టిన ఒక ఆసామి ఆయనని ఆ కుక్కనీకూడా చాలా అపేక్షగా చూసి శాయశక్తులా చాకిరీచేసి స్తుతించేవాడు.

జమీందారుగారు వీలునామా వ్రాయించినపుడు ఈ బీదభక్తుడు గుర్తుకొచ్చాడు. "పాపం అతనికి డబ్బుమీద తృష్ణేలేదు. నేనూ సివంగీ అంటే ప్రాణం. నేను

పోతున్నాననుగాబట్టి సివంగిని ఆయనపేర రాయించెయ్యండి''
అన్నాడు.

* * *




చెప్పదలుచుకున్న మూడులక్షల ముక్కలూ చెప్పి.
"మీరంతా ఓపిగ్గా శ్రద్ధగా విన్నందుకు కృతజ్ఞుడిని—ఇక
ముగిస్తాను. కాలాతీతం అయినట్టుంది," అంటూ "టైమెం
తండీ" అని పక్కాయన్ను అడిగాడు ఒక వక్త.

"టైము తో మీకు పనేమిటి. వెనకాల క్యాలెండ
రుంది చూసుకోండి'' అన్నాడు ఒక శ్రోత.

* * *




(మనది తప్పు)

మంత్రిగారు పిచ్చాసుపత్రిలో ప్రేమికులశాఖ

చూస్తానన్నారు. వార్డెన్ ఆయన్ని ఓ గదిదగ్గరకు తీసు కెళ్ళాడు "ఈయన పాపం ఒక సుందరిని ప్రేమించాడు. కాని ఆమె డబ్బుకాశించి మరొకడిని పెళ్ళాడింది. ఇతనికి పిచ్చెక్కి ఇక్కడ చేరాడు"

పక్కగదిలో గడ్డపాయన కూర్చుని నవ్వుకుంటు న్నాడు.

"ఇందాక చెప్పిన సుందరి పెళ్ళాడింది వీరినే," అన్నాడు వార్డెన్.

* * *

పిచ్చాసుపత్రిలో ఒక ఆసామి ఒక్కడే కూర్చుని ఉలికులికి నవ్వేసుకుంటున్నాడు. చూడపోయిన ఓ పెద్ద మనిషి దగ్గరగా వెళ్ళి సానుభూతితో అతని సంగతి అడిగాడు.

"అబ్బే ఏంలేదండి. నేను జోకుల పుస్తకం తయారు చేస్తున్నాను. వందలకొద్ది జోకులు రాశానేమో ఒకొక్కటే గుర్తొచ్చి విరగబడి నవ్వుకోసాగాను. అది చూసి నాకు పిచ్చెక్కిందని తెచ్చి ఇందులో పడేశారు పిచ్చి వెధవలు," అని పకపక నవ్వాడతను.

* * *

రాష్ట్రమంత్రి పిచ్చాసుపత్రి చూడబోయాడు. ఒక తను దగ్గరకువచ్చి 'ఎవడు నువ్వు'అని గద్దించాడు చుట్టూ

వున్న అధికారులను ఆగమని సైగచేసి, మంత్రిగారు తన హోదా చెప్పారు.

అతను చుట్టూచూసి ఇంకా దగ్గరగావచ్చి చెవిలో చెప్పాడు. "నాకు తెలుసు. నేను నమ్ముతాను. కాని గట్టిగా అనకు. ఇంకెవరికీ చెప్పకు. చెబితే నాకుపట్టినగతే నీకూ పడుతుంది."

* * *

వి. వెంగళప్ప కాగితం కలం తెప్పించుకుని బుద్ధిగా కూచుని ఉత్తరం రాయసాగాడు.

ఓ గంట తరవాత వైద్యుడువచ్చి అడిగాడు, "ఏమిటి వెంగళప్పా తెగరాస్తున్నావు?" అని.

"ఉత్తరం అండీ."

"ఎవరికి?"

"ఎవరికో రాయడానికి నాకేంపట్టింది. నాకే రాస్తు న్నాను."

"ఏమని రాశావు?" అన్నాడు డాక్టరు నవ్వుకుని.

"నీకేం పిచ్చా వెర్రా, ఉత్తరం ఇంకారాయలేదు; పోస్టులో వెయ్యలేదు; నాకు అందలేదు. అందులో ఏముందో ఎలా చెప్పనయ్యా!" అన్నాడు వెంగళప్ప జాలిగా నవ్వి.

* * *

పిచ్చి పూర్తిగా కుదిరిపోయిందనీ మర్నాడు ఇంటికి పంపిస్తున్నామనీ చెప్పాడు డాక్టరు.

పిచ్చయ్య మర్నాడు ప్రొద్దుటే లేచి గడ్డం చేసుకుంటున్నాడు—స్నానం గీనం చేసి సిద్ధమవుదామని.

అంతలో గది తలుపు ఎవరో తెరిచినట్టయి వెనక్కి తిరిగాడు. చెయి తగిలి అద్దం జారి పడిపోయింది.

పిచ్చయ్య ఇటు తిరిగేసరికి అద్దంలో తన మొహం కనబడ లేదు.

"డామిట్! చూడండి డాక్టరుగారూ! ఇవాళ విడుదల చేస్తున్నారుగదా ఇంటికి పోదాం అనుకుంటూవుంటే పరాకులో పీకె తెగ్గోసుకు కలకాయెక్కడో పారేసుకున్నాను. ఇప్పుడు ఇంటి కేమొహం పెట్టుకెళ్ళమంటారూ?" అన్నాడు పిచ్చయ్య.

* * *

పిచ్చాసుపత్రి చూడబోయిన ఒకాయన ఒక గదిలో ఇద్దరు పిచ్చివాళ్ళు తనకేసి దీక్షగా చూడడం గమనించి తను వారికేసి చూస్తూ గుడ్లప్పగించి నిలబడి పోయాడు.

గదిలో ఇద్దరిలో ఒకడు రెండోవాడిభుజం తట్టాడు. "ఇదికాదు బ్రదర్ పద్ధతి—మనని గదిలో పెట్టి పిచ్చివాళ్ళని తీసుకొచ్చి చూపించడం పిచ్చిపద్ధతి. అంతకన్న పిచ్చివాళ్ళనే గదుల్లో పెట్టి మనం మామూలుగా వచ్చి చూసి పోయే ఏర్పాటు చేస్తే బాగుండదూ!" అన్నాడు.

* * *

దారిన్తోస్తున్న పిచ్చివాళ్ళను పదిమందిని కాలవ గట్టుకు షికారు తీసుకెళ్ళారు డాక్టర్లు. హఠాత్తుగా ఒకతను కాలుజారి కాలవలో పడిపోయాడు. ఇంకో పిచ్చివాడు వెంటనే దూకి అతన్ని కాపాడి పైకి తీసుకొచ్చాడు. డాక్టరు ఇతన్ని అభినందించాడు; "నువ్వు ఒక ప్రాణాన్ని కాపాడావు. విలువలు తెలిశాయన్నమాట. నీవల్ల ఎవరికీ హాని వుండదు. అందువల్ల నిన్ను త్వరలోనే విడుదల చేస్తారు," అని.

మర్నాడు ఉదయం డాక్టరు పరుగెత్తుకువచ్చి, "పిచ్చయ్యా! నిన్న నువ్వు రక్షించినవాడు పాపం ఉరేసుకు చచ్చిపోయాడు," అన్నాడు.

పిచ్చయ్య నవ్వాడు, "భలేవారండి! ఉరీకాదు ఏం గాదు. నిన్న నీళ్ళలో తడిశాడుగదా అని ఎండబెట్టడానికి నేనే వాణ్ని దూలానికి వేళ్ళాడగట్టాను."

*   *   *




పొగ తాగితే క్షయ, కాన్సరు వగైరాలు వస్తాయని,

ఆయుక్షీణమని తరుచు శాస్త్రజ్ఞులు ప్రకటనలు చేస్తూ వుంటారు. వ్యాసాలు రాస్తూ ఉంటారు.

"ఇవన్నీ చదివి చదివి ఇక లాభం లేదని కొనడం మానేశానోయ్," అన్నా డొకాయన.

"ఏది సిగరెట్లే?"

"అబ్బే, పత్రికలూ, పుస్తకాలూనూ."

*　　*　　*

ఒక "పొగ తాగనివాడు," ఇంకో "పొగ తాగుబోతు" ను మరమ్మతు చెయ్యదలచాడు.

"మీరు రోజు కెన్ని కాలుస్తారండి!"

"రెండు."

"పెట్టెలా?"

"టిన్నులు."

"శివశివ.... ఎంతడబ్బు.... ఇదిగో అటుచూడండి. ఆ యేడంతస్తులమేడ.... అది ఎంత చేస్తుందంటారు?"

"ఏం ఐదు లక్షలు చెయ్యొచ్చు"

"మీరుగనక సిగరెట్లు కాల్చిఉండకపోతే ఈపాటికి ఆ భవంతి మీదే అయుండేది"

"మీరు సిగరెట్లు కాలుస్తారా?" అన్నాడు తాగుబోతు క్రాసు పరీక్ష ఆరంభించి.

"తాగను"

"ఆ మేడ మీదేనా?"

"కాదు"

"అయితే వినండి. ఆ మేడ నాదే."

*　　*　　*

బీర్బల్ చేత ధూమపానం మాన్పించాలని ప్రయత్నిస్తున్న అక్బర్ ఒకనాడు ఒక గాడిదనోటికి హుక్కా గొట్టం అందించమన్నాడు నౌకర్ని. గాడిద మొహం తిప్పుకుంది.

"చూశావా చివరికి గాడిదకూడా ద్వేషిస్తోంది పొగాకును," అన్నాడు అక్బర్.

"అవును ప్రభూ. పొగాకును ద్వేషించగలిగింది కాబట్టే 'గాడిద' అన్నారు," అన్నాడు బీర్బల్.

*　　*　　*




"నాన్నా, నాన్నా నేను ఈ ఏడు పరీక్ష పాసయితే పది రూపాయి లిస్తానన్నావు కదూ?"

"అవును."

"అయితే ఓ శుభవార్త చెప్పనా?"

"పాసయ్యావా"

"అబ్బే నీ కా ఖర్చు తప్పింది ఈసారి"

*　　*　　*

తండ్రి ప్రోగ్రెస్ రిపోర్టు చూసి మండిపడ్డాడు.

"ఏమిటిది, దరిద్రంగా ఉంది"

"నేను చెప్పానా్నా. మా నాన్నకి నచ్చదండి, పంపద్దూ అని. మేష్టారే బలవంత పెట్టాడు."

* * *

"మా రావుడు బలే చురుకైన పిల్లవండి. వాడికి ఎన్ని కొత్తకొత్త ఊహ లొస్తాయో, ఎన్ని స్వతంత్ర భావాలో మీ రెప్పుడన్నా గమనించారూ?"

"ఆహా. ముఖ్యంగా ఎక్కాల విషయంలో మీ వాడికి సొంత అభిప్రాయాలు చాలా ఉన్నాయి. ఆరైదులు నలభై అని అతని అభిప్రాయం."

* * *

గొప్పింటి బిడ్డ, గారాలకూచి అల్లరి పడలేక, కొట్టే తాహతులేక మాష్టరుగారు వాళ్ళ యింటికి వెళ్ళి తండ్రికి ఫిర్యాదు చేశాడు.

"మీ అబ్బాయి ఏమీ చదవడుసరికదా క్లాసులో విపరీతమైన అల్లరి చేస్తున్నాడండి"

"ఈ మాత్రానికి నాతో చెప్పాలిటండీ... ఈసారి వాడు అల్లరి చేస్తున్నప్పుడు, వాడి ప్రక్కనున్న కుర్రాడెవడినైనా చావచితగ్గొట్టెయ్యండి. దాంతో భయపడి మన వాడు దారికొస్తాడు," అన్నాడు తండ్రి.

* * *

మేష్టరుగారు చైనా పాఠం చెబుతున్నారు.

"చైనా జనసంఖ్య అధికం అంటే జననాలూ, మరణాలూ కూడా ఎక్కువేనన్నమాట. మనం ఒక్కసారి గాలి పీల్చి వదిలేసరికి చైనాలో ఒక్కడు చచ్చిపోతూ ఉంటాడు ..."

ఒక పిల్లాడు హఠాత్తుగా రొప్పుతూ ఉండడం చూసి "ఏమిటది ఒంట్లో బావులేదా?" అన్నారు మాష్టారు పాఠం ఆపి.

"కాదండి, చైనావాళ్ళని చంపేస్తున్నాను."

* * *

"'గుఱ్ఱము' అని రాయమంటే 'గఱ్ఱమ' అని రాశావేవిట్రా చెవలాయా?

"మరి 'గుఱ్ఱానికి కొమ్ములుండవు' అని మీరే చెప్పారుగదండీ!"

* * *

"ఉష్ణంవల్ల వ్యాకోచము సంభవించునా? లేక సంకోచమా?" అన్నాడు మేష్టారు.

"సంకోచము సార్"

"ఛీ తప్పు, వ్యాకోచము — వ్యాకోచం అంటే పెద్దగి అవడం...."

"మొన్న నాకు ఉష్ణం తగిలి చాలా చిక్కిపోయా నండి. ఆపైన మీ ఇష్టం."

*    *    *

స్కూళ్ళ ఇన్‌స్పెక్టరుగారు తనిఖీ చేస్తున్నారు

"భూమి ఎలా ఉంటుందబ్బాయ్. నువ్వు చెప్పు?" అన్నాడు ఓ కుర్రాణ్ణి చూసి.

వాడు దిక్కులు చూసి అన్నీ అయిపోయాక మాష్టారుకేసి చూశాడు. ఇన్‌స్పెక్టరు వెనక నిలబడిన ఆయన తన పొడుంకాయ చూపించి సైగ చేశాడు.

తక్షణం కుర్రాడికి ఎక్కడలేని తెలివితేటలూ వచ్చేశాయి "భూమి మామూలు రోజుల్లో కొంచెము కోలగానూ, శని ఆదివారములలో చదరముగానూ ఉండును" అన్నాడు.

మాస్టరుగారు శని ఆదివారాలలో ముక్కుపొడుం డబ్బా వాడతారు.

*    *    *

"ఏవండీ మాస్టరుగారు, మా వెధవ లెక్కల్లో ఏమన్నా మెరుగేనాండి?"

"అబ్బే ఎక్కాలుకూడా రావండి. ఏడ్డైదు ముప్ఫైమూడు అంటాడింకా"

"ఓస్ అంతేగదా, ఒక్కటి తక్కువ చెప్పాడన్న మాట. ఫరవాలేదు," అన్నాడు తండ్రి.

* * *




ఒక పల్లెటూరి మోతుబరి, పట్నంలో డాక్టరీ చదువుతున్న కొడుకుని చూడడానికొచ్చాడు. కొడుకు అతనికి ఊరంతా చూపించాడు. తరవాత ఒక పెద్ద పధ్నాలుగు అంతస్తుల భవంతికి తీసుకు వెళ్ళాడు.

లిఫ్టు దగ్గిర కొడుకు ఎవరో మిత్రుడితో మాట్లాడుతున్నాడు. తండ్రి ఆ చిన్న గదికేసి వింతగా చూస్తున్నాడు. అంతలో ఒక అరవై ఏళ్ళ ముసలావిడ అందులోకి వెళ్ళింది. తలుపులు రాసుకున్నాయి. ఎర్రదీపం వెలిగింది. ఏవన్నా ఓఘాయిత్యం జరగదుగదా అనుకున్నాడు మోతుబరి. అంతలో తిరిగి తలుపులు తెరుచుకున్నాయి. చేగురువాడు వంకాయలాగా నవనవలాడుతున్న పాతికేళ్ళ పడుచుపిల్ల ఆ గదిలోంచి యివతలికివచ్చి అతనిపక్కనించి వెళ్ళిపోయింది.

"దీంతస్సదియ్యా తెల్లోడి బిస ఎంతుందీ! మీ యమ్మని తీసుకొచ్చి ఇదిగిందులో ఓసారి పెట్టి తీయాల్సిందిరా అబ్బాయ్. పొరబాటు జేశాను," అన్నాడు మోతుబరి నోరావలించి చూస్తూ.

* * *

కోనయ్య కోర్టుపనిమీద గోదారి దాటి పట్నంవచ్చి వుశేల్లో దిగాడు. రాత్రి పడుకొని పొద్దున్నే తెల్లవారగానే మేనేజరు దగ్గరకొచ్చి, "దీన్నిగదరగా ఏవి దీపాలయ్యా మీ రెట్టినవి. రాతిరంతా నిదరలేదు. ఆ దిక్కుమాలిన దీపం తెల్లవార్లూ అలా ఎలుగుతునే వుంది" అన్నాడు.

"ఆర్పెయ్యకపోయారూ?" అన్నాడు మేనేజరు.

"ఆ మాత్రం బుద్ధిపోలేదంటావా ఎంతసేపు ఊదాననీ. దాన్నిగదరగ దాన్ని సీసాలోబెట్టి మూత బిగిస్తిరి గదయ్యా."

* * *

## అనుకోకండా...

పెత్తనానికొచ్చిన మూడోవీధి ఆవిడకి చాలా మర్యాదచేసి చాలాసేపు కూచోబెట్టింది ఓ యిల్లాలు. ఆఖరికి ఆవిడ లేవబోతుండగా, "వెళ్దురుగాని ఒక్క పాట పాడండి," అంది.

"ఒద్దమ్మా పొద్దోయింది. ఇరుగు పొరుగు అంతా పడుకొనుంటారు"

"అయితే మరీ మంచిది. మొన్న వాళ్ళు మా కుక్క-పిల్లకి విషంపెట్టి చంపారు. ఇప్పుడు శాస్తి చేదాం. మీరు పాడండి చెబుతా" అంది గృహిణి కసిగా పొరుగింటికి అడ్డున్న గోడకేసి చూస్తూ.

* * *

తల్లీ కూతురూ రైల్లో వెళ్తున్నారు. పిల్ల ఎవర్నో చూసి, "అదుగో నాన్న... నాన్నా! నాన్నా!" అని పిలవ సాగింది.

"తప్పమ్మా పాపా. ఆయన నాన్నకాదు. ఎవరో పెద్దమనిషి" అంది తల్లి

* * *

"ఎవడో చవటదద్దమ్మ దమ్ముల్లేక ఆకాశరామన్న ఉత్తరం రాశాడు చూశారా! నేను చవట దద్దమ్మనిట" అన్నాడు మేనేజరుగారు.

"ఛా. ఎవడో ఆరా తియ్యాల్సిందే. చూడండి. దస్తూరినిబట్టి పోల్చుకోలేరూ? ఎవడో వెధవ మిమ్మల్ని బాగా ఎరుగున్నవాడే అయుండాలి. లేపోతే అలా రాయడు" అన్నాడు హెడ్ క్లార్కు.

* * *

"ఒరేయ్. మన గదికి తాళం వెయ్యడం మర్చి పోయినట్టున్నాను. ఏమైనాపోతే—"

"నీ మొహం. మనిద్దరం ఇక్కడే ఉండగా ఎలా పోతాయిరా?" అన్నాడు రూమ్ మేటు.

* * *

మంత్రిగార్ని చూసివచ్చాడు రిపోర్టరు.

"ఏవండీ. ఉన్నాడా? ఏమంటాడు?" అన్నాడు సంపాదకుడు.

"ఏబ్బే. ఏమీ అనడండి. ఏం చెప్పలేనన్నాడు."

"అయితే రెండుకాలాల్లో సరిపెట్టండి రిపోర్టు," అన్నాడు సంపాదకుడు.

* * *

"నేనెందుకు బతికి వున్నాను?" అనే శీర్షికతో ఏభై పేజీల చిన్నకథ రాసి పంపాడు ఒక రచయిత.

"పోస్టులో పంపారుకాబట్టి" అని జవాబు రాసి తిప్పి పంపాడు సంపాదకుడు.

* * *




(దొరికిన బాపతు)

ఒకతను ఒగురుస్తూ పరుగెత్తుకొచ్చి, "ఏమండీ ఈ దారిన ఒక పోలీసుజవాను యెక్కడేనా కనబడ్డాడా" అన్నాడు కంగారుగా.

"లేదండీ. నే నెక్కడా చూళ్లేదే," అన్నాడా పెద్ద మనిషి జాలిగా.

"సర్లెండి. మీ జేబులో పరుసిలా పారెయ్యండి. వాడొచ్చేవేళైంది" అంటూ చాకు చూపించాడు దొంగ.

* * *

"నిందితుడు నిర్దోషి అని జూరీ అభిప్రాయ పడింది" అన్నాడు న్యాయమూర్తి.

"అంటే?" అన్నాడు ముద్దాయి.

"నువ్వు దొంగవు కావుట నిన్ను విడుదల చేస్తున్నాను"

"అంటే-ఆ నగలమూట ఇవ్వక్కర్లేదా?" అన్నాడు ముద్దాయి.

* * *

ఖైదులో వేసిన మూడో నాడు అపరాధి వార్డెను దగ్గ రకు పరుగెత్తి తనని విడుదల చెయ్యమన్నాడు.

వార్డెను తెల్లబోయి కారణం అడిగాడు.

"నా సావాసంవల్ల మీ ఖైదులో జనం అంతా పాడవుతారని నాకు భయంగా వుంది" అన్నాడు ఖైదీ.

"ఏంచేత?"

"ఈ ఖైదు మొత్తంమీద నిజంగా నేరం చేసింది నే నొక్కడినేలావుంది. వాళ్ళంతా అమాయకులే."

*　　*　　*




"ఏరా వెధవా నా జేబులో బేడకాసు తీసు కున్నావా?" అని కొడుకును గద్దించాడు తండ్రి.

"ఏమండీ. వాడే తీశాడని మీ కెలా తెలుసు? నేను తీసివుండకూడదా?" అంది ఇల్లాలు నవ్వుతూ.

"నువ్వు చెయ్యిపెడితే జేబు పూర్తిగా ఊడ్చేస్తావుగా అదే గుర్తు" అన్నాడు భర్త.

*　　*　　*

ఇద్దరు దొంగలు బట్టలషాపులో జొరబడ్డారు.

"చూశావా ఈ చీరల ధరలు ! వీళ్ళదుంపతెగ. దోపిడీ, నిలువు దోపిడీ!" అన్నాడు దొంగ గుండెలు బాదుకుని.

* * *

"వెబ్‌స్టర్స్ డిక్షనరీ (నిఘంటువు) చూశావోయ్?" అన్నాడొకడు మిత్రుడితో.

"ఆ ఎందుకులెస్తూ ఓపిక లేదు. యెలాగా సినిమా వస్తుందిగా అప్పుడు చూసేస్తేసరి" అన్నాడు చిత్రాలద్వారా సాహిత్య మధువు పీల్చేస్తున్న ఒక ప్రేక్షక భ్రమరుడు.

* * *

"నిన్న పత్రికలో నీ జీవిత చరిత్ర చదివాను. బాగుంది. యెవ్రరాసిపెట్టారే ?" అంది ఒక తార సాటి తారతో.

"ఎవరైతేనేంగాని నీ కెవరు చదివిపెట్టారు?" అంది మేటి తార.

* * *




"నాన్నా నాన్నా నాకు మూడు చక్రాల సైకిలు

కొనిపెట్టవూ. ఊఁ! ఊఁ?" అని గారాలు పోతూంటుఁ పన్నెండేళ్ళ బాలాకుమారుడు.

"ఎందుకు యింక రెండేళ్ళు ఓపికపట్టు. యేకంగా పెద్దదే కొనిస్తాను—సైకిలు రిక్షా" అన్నాడు తండ్రి ముచ్చటగా.

* * *




(తరువాత జీవితం)

కుటుంబరావుగారు పదిరోజులు జబ్బుపడి, లేచేసరికి డాక్టరు బిల్లు, మందూ మాకూ కలిసి వందరూపాయల పైచిలుకైంది.

"హుఁ. కలికాలం. వెనకటి రోజులే నయం. నా చిన్నతనంలో వందరూపాయలు పెడితే హాయిగా ఆర్నెల్లు జబ్బు పడిందికి జరుగుబాటయ్యేది" అన్నాడాయన నిట్టూర్చి.

* * *

## హోటళ్ళు

హోటళ్ళల్లో కాఫీ, టీ వగైరాల కొండగుర్తులు చిరకాలంగా వుంటున్నవి. అందరూ ఎరిగున్నవి. హోటళ్ళలో కాఫీ, టీ, వోవల్టిన్ అన్నీ ఒక్క గిన్నెలోనే కలిపేసి తరవాత వేర్వేరు గిన్నెల్లో పోస్తారు. కిరసనాయిలు వాసనున్న గిన్నెల్లో సరుకు కాఫీ అయితే ఆవదం పరిమళం గలది టీ. పెట్రోలుకంపుది ఓవల్టిన్. ఇదీ వరస.

*    *    *

హోటల్లో భోజనం చేస్తూన్న ఒక పెద్దమనిషి; "సెర్వరూ ఇలా రా. నే నడిగేది వెయ్యకుండా ఆ మూల కూచున్నవాణ్ణి పందికొక్కులా మేపుతున్నావు కదూ. మేనేజర్నిలా పిలూ నీ పని చెప్తా" అన్నాడు.

"నా రేనండీ మేనేజరుగారు" అన్నాడు సెర్వరు అంతర్ధానమవుతూ

*    *    *

ఒక పూటకూళ్ళమ్మ చిన్న మిళ్ళగరిటెలో మైనం మెత్తినట్టు వడ్డించేది నెయ్యి. ఈ వరస చూసి విసుగెత్తిన ఒక ఆసామి, ఒకరోజు సంజెవేళ భోజనానికూర్చుని ఆమె నెయ్యి వడ్డించగానే, "అమ్మా దీపం పట్రా వోసారి" అన్నాడు కంగారుగా. ఆవిడ దీపం దగ్గిరిగా తెచ్చి, "ఏం పడింది నాయనా?" అంది.

"అబ్బే ఏదో ఇట్టె మెరిస్తే జెర్రిపిల్ల అనుకున్నాను. నేచ్చుక్క గాబోల్లెండి" అన్నాడు.

* * *



గారడీవాళ్ళకి ఆ విద్య విసుగేస్తే హోటళ్ళలో సెర్వర్లుగా వస్తారు; వీళ్ళకిది విసుగేస్తే అందులోకి పోతారు. అందు వల్లనే సెర్వర్లు ఇరవైఐదు ప్లేట్ల టిఫినూ, పది కప్పుల కాఫీ ఒక్కసారి పట్టుకుని అవలీలగా వాటిని బాలెన్సు చేస్తూ వస్తారు. ఒక సెర్వరు ఒక ప్లేటులో ఒక్క పెసరట్టు పెట్టి అందుమీద రెండో చెయ్యి వేసిపట్టి, పట్టుకువస్తున్నాడు తినబోయే పెద్దమనిషి విస్తుబోయి "అదేవిటయ్యా తినేదానిమీద అరచెయ్యిపెట్టి పట్టుకొస్తావు" అన్నాడు.

"మళ్ళీ కిందపడిపోకుండానండీ" అన్నాడు సర్వరు.

* * *

"ఈసరయ్యా హోటల్లో ఈమధ్య కాఫీ, భోజనం చాలా సజావుగా వుంటోందేవిటోయ్? ...."

"దానికి చాలా కథుందిలే. కొత్త మేస్ట్రీటుగారు లోగడ ఇక్కడ చదూకుంటున్న రోజుల్లో ఈసరయ్యా హోటల్లో తిండి తినేవాట్ట. ఇప్పుడు మేస్ట్రీటుగా వచ్చాక, మొన్నెదో కేసులో ఈసరయ్యా దొరికాడు. పూర్వపు విశ్వాసంకొద్దీ మేస్ట్రీటుగారు అతన్ని ఖైదులో వేయించినా

ఖైదులో వేయించినా భోజనం, కాఫీ, ఫలహారాలూ మటుకు అతని హోటల్నించే కొని పట్టికెళ్ళి పెట్టాలని తీర్పు చెప్పాడు. విడుదలై వచ్చినప్పటినించీ వంటలు మార్పించేశాడు ఈసరయ్య.

* * *

మహాపురుషుడు ఐన్‌స్టీన్‌ను యెరగనివారు [illegible] ఆయన ప్రతిభను ఏమాత్రం పోల్చుకోలేరు. గొప్పవాళ్ళందరిలాగే ఆయన వెర్రివాడిలా ఉంటాడు. ఒకసారి ఆయన హోటలుకు వెళ్ళాడు. మెనూ కార్డు (ఫలహారాల విషయాల క్రమణిక) చదవబోయి కళ్ళజోడు లేదని గుర్తొచ్చి, వెయిటర్‌ను పిలిచి, "నువ్వే చదువు వింటాను" అన్నాడు.

వెయిటర్ అటూ ఇటూ చూసి కొంచెం వంగి "నాకూ మీలాగే చదువు రాదండీ" అన్నాడు.

* * *

ఒక పెద్దమనిషి హోటల్లో సుష్టుగా మేసి డబ్బివ్వకుండా జారుకున్నాడు.

"పాపాత్ముడు. ఎక్కడికి పోతాడ్లెండి. దేవుడు వాడికి తగ్గ శిక్ష వెయ్యకపోడు" అన్నాడు మేనేజరు జనాంతికంగా.

20)

"వేరే ఇంకా శిక్షేమిటి. తిన్నదే శిక్ష. ఇప్పుడు తిన్నదే వాణ్ణి పట్టి హరతమారుస్తుందిలెండి" అన్నాడు బిల్లు జల్లించవచ్చిన ఇంకో ఆసామి.

*   *   *

చెన్నపట్నంలో జనసమ్మర్దం విపరీతంగా ఉండేది ఒకప్పుడు. (ఇప్పుడూ అంతే; ఎప్పుడూ ఇంతే) ఒక మనిషి భోజనం చేస్తూవుంటే వెనకనే పదిమంది క్యూలో నిలబడే వారు. ఆ సందర్భాన్ని చూపిస్తూ ఒక పత్రిక కార్టూను వేసింది. దానికి శ్రీ శ్రీ వ్రాసిన వ్యాఖ్య :

"కాలే కడుపుకు కూడా
క్యూలే దిక్కయ్యేరన్న గువ్వలచెన్నా"

*   *   *

సుబ్బారాయుడు సూటూ బూటూ హాటూ బనాయించి దర్జాగా హోటలుకెళ్ళి కూచుని స్వీటూ హాటూ ఇంకో హాటూ, కాఫీ ఇంకోమాటూ ఆరగించి బ్రేవుమని తేన్చి సిగరెట్టు ముట్టించి, సెర్వరు వీరాజు బిల్లు తేగానే చిరునవ్వు కన్నులరమోడ్చాడు. "వీరాజూ, నీకు జ్ఞాపకం ఉందిటోయ్ ? ఆర్నెల్లక్రితం నే నిలాగే ఓసారి వచ్చి సుష్టుగా కాఫీ టిఫినూ పుచ్చుకున్నాను. జేబులో డబ్బుల్లేవు అప్పుడు. ఆపటాన నువ్వు నా మెడమీద

చెయ్యేసి గుమ్మందాకా నెట్టుకొచ్చి మురికాల్వలోకి ఒక్క తోపు తోశావు .... గుర్తుందా ?" అన్నాడు హుందాగా.

వీరాజు సిగ్గుపడి నీళ్ళునమిలి, "చిత్రం ఏదో అప్పట్లో పొరబాటయిపోయింది" అన్నాడు.

"ఆ తప్పేముందిలే. ఇప్పుడు మళ్ళీ ఓసారి అలాంటి సందర్భం వచ్చేట్టుంది చూడు. ఈసారి కాలవలోకి తొయ్యకేం. కాస్త అసుంటా తొయ్యి"

* * *




'నీకో తమాషా చూపిస్తాను రా' అని చెప్పి నా మిత్రుడు నన్ను శివాలయానికి తీసుకెళ్ళాడు. మండపంలో ఒక వెర్రిబాగుల కుర్రాడు కూర్చుని పాడుకుంటున్నాడు. నా మిత్రుడు వాడి ముందర ఒక కానీ, ఒక పావలాకాసూ పెట్టి నీకేం కావాలో అది తీసుకో అన్నాడు. వాడు గబుక్కున కానీ తీసుకుని చెయి వెనక్కి పెట్టుకున్నాడు. చూశావా అన్నాడు నా మిత్రుడు నవ్వి. నేను మర్నాడు

అటు వెళ్ళినప్పుడు ఆ కుర్రాడిని చేరబిలిచి మళ్ళీ పరీక్షించాను. అల్లాగే చేశాడు. జాలివేసింది నాకు.

"చూడు నాయనా కానీకన్నా పావలా ఎక్కువ. చిన్నదయినా దీనికే ఎక్కువ పకోడీలూ జీళ్ళూ వస్తాయి. అంచేత ...."

"తెల్సులేవయ్యా. నాకూ తెల్సు. కాని నే నొక్క రోజు కనక పావలాకాసు తీసుకొంటినా మళ్ళీ రేపటాల్నించి నే నెర్రెదవననెవుడూ అనుకోడు. అప్పుడు పావలా రాదు, కాండబ్బు కూడా రాదు .... ఒవురికీ చెప్పోకయ్యోవ్" అన్నాడు వెర్రిబాగుల కుర్రాడు తమాషాగా నవ్వి.

* * *




"అపరాధం చెయ్యడంకన్న క్షమాపణ చెప్పుకోవడం ఒకొక్కసారి ప్రమాదకరం అవుతుంది" అన్నాడు విదూషకుడు యథాలాపంగా.

అందుకు దృష్టాంతరం చూపించకపోతే తలకొట్టిస్తా నన్నాడు రాజుగారు.

సాయంత్రం రాజుగారు వన విహారం చేస్తూ ఒక చిన్న పూలమొక్క దగ్గర ఆగి ముందుకు వంగారు.

విదూషకుడు వెనుకనుండి వచ్చి కాలితో ఒక్క తాపు తన్నాడు. రాజుగారు ముందుకుపడి, లేచి గర్జించారు—"ఏమిటిది ?" అని.

"క్షమించాలి — రాణిగారనుకున్నాను" అన్నాడు విదూషకుడు.

* * *




ఇద్దరు కళాభిమానులు చిత్రకళా ప్రదర్శనం చూడబోయారు. సింహద్వారందగ్గరే ఆగిపోయారు ఇద్దరూ.

"ఇదేమిటండీ. ఈ వెధవబొమ్మని ఇక్కడ వేళ్ళాడదీశారు ?

"బొమ్మ్మేసిన వెధవ నోరికి ఉండదు" అన్నాడు మిత్రుడు.

* * *

అధివాస్తవిక చిత్రకారుడు పికాసోని గురించిన ఒక కట్టుకథ. ఆయనమీద కాకపోయినా, ఆ ధోరణి అనుకరించివచ్చిన వేలాది చిత్రాలమీద చక్కని వ్యాఖ్య.

ఆయన ఒక చిత్రం పూర్తిచేసి తదేకంగా చూస్తున్నాడట.

"బొమ్మ బాగా కుదరలేదా ?" అన్నాడు ఒక మిత్రుడు.

"మరే. ముక్కు సరిగ్గా రాలేదు" అన్నాడు పికాసో.

"ముక్కు ఎక్కడ ఉంది ?" అని తెగించి అడిగేశాడు మిత్రుడు.

"అదే నేనూ చూస్తున్నాను" అన్నాడు పికాసో.

* * *

ఇద్దరు పిల్లలు ఆటనుంచి ఇంటికి వెళ్తూవుండగా వర్షం వచ్చింది. ఒక చిత్రకళా ప్రదర్శనశాలలో జొరబడ్డారు. గుమ్మంలోకి వెళ్ళగానే ఒక అధివాస్తవిక చిత్రం కనపడింది. పిల్లలిద్దరూ దాన్ని చూశారు. తరువాత మొహామొహాలు చూసుకున్నారు.

"మనం ఇక్కడ కనిపిస్తే ఇది మనపనే అని పట్టుకుపోతారు పద" అన్నాడొకడు. ఇద్దరూ పారిపోయారు.

* * *

## ఉద్యోగపర్వం

హెడ్ క్లార్కుగారి వేడి చూపుకు తట్టుకోలేక, ఆయన అడక్కుండానే ఆలస్యానికి కారణం చెప్పేశాడు కోనేటిరావు—"వెధవకి ఇవాళ నిద్రలేచేసరికే బాగా పొద్దెక్కిపోయింది" అని.

"ఓహో. నువ్వు ఇంటో కూడా నిద్దరోతున్నావన్న మాట!" అంది హెడ్ క్లార్కు హెవీ ఆశ్చర్యం నటించి.

* * *



ప్రొప్రయిటరు అకౌంట్సు గదిలోకొచ్చి గుమాస్తాను నిద్రలేపాడు:

"క్షమించండి ... ముఖ్యమైన వార్త చెప్పాల్సి ఉంది. లేపోతే నిద్రాభంగం చెయ్యను .... మిమ్మల్ని డిస్మిసు చేశాను. పడుకుని లేచాక ఇంటికెళ్ళిపోండి".



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA112B177 |
| పుస్తకం పేరు | నవ్వితే నవ్వండి మాకభ్యంతరం లేదు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 167 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 1, 10, [illegible] |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |